# తాళ్ళపాక అన్నమయ్య రచించిన

# అలమేలుమంగ(వేంకటేశ్వర) శతకం

## (లఘు వివరణతో)

డా.తాడేపల్లి పతంజలి

**శతకవివరణ చదవబోయే ముందు రెండు విషయాలు**

**1.ఈ శతకంలోని సంబోధన వేంకటేశ్వరా ! కాని ఈ సంబోధన ఇది ఒక్కొక్కసారి వేం క టే శునికి , ఒక్కొక్కసారి అలమేలు మంగకి అన్వయిస్తుంది.అన్నమయ్య దృష్టిలో వేంకటేశునికి, అలమేలు మంగకి మధ్య తేడాలేదు. అందుకే సంబోధనలో కూడా అభేదాన్ని పాటించాడు.**

**సాధారణంగా శతకములే దేవతను గురించి వ్రాయబడునో ఆ దేవతను మాత్రమే సంబోధించు రీతిని శతక రచన సాగుచుండును. కాని యిందట్లు కాక అపూర్వముగా దివ్య దంపతుల నిరువురను సంధానించు రీతిని రచన సాగినది. అర్ధ నారీశ్వరుడని పేరు గాంచిన పరశివుని గూర్చిన శతకములందేని యింతకుముందిట్టి ప్రయత్నము జరిగి యుండలేదు. అందుకే ఈ శతకము నవ్య కావ్యమని పేరు గాంచిందన్నారు ఆచార్య వేటూరి ఆనంద మూర్తి. (తాళ్లపాక కవుల కృతులు- వివిధ సాహితీ ప్రక్రియలు- పుట 329.)**

**2. శతకంలోని కొన్ని పద్యాల పాదాలు లభించలేదు. వాటిని యథాతథంగా ఉంచాము.**

**- డా.తాడేపల్లి పతంజలి , వివరణ కర్త**

---------------------------------------------------------------------------------------------------

శ్రీసతి నీలజాంబవతి శ్రీయమునాసతి సత్యభామ ధా

త్రీసతి రుక్మిణీరమణి దేవియిలాసతి వీర లందఱున్

జేసినసేవ చేసెదను జేకొను శ్రీయలమేలుమంగ నీ

మూసిన ముత్యమై యురము ముంగిట జెంగట వేంకటేశ్వరా ! 1

ముఖ్య పదార్థం-

సతి= పతివ్రత; ధాత్రీసతి, భూదేవి చేకొను - గ్రహించు; మూసిన ముత్యము =అణగిమణగి యుండునది ,చెంగట -సమీపము.

తాత్పర్యం:

వేంకటేశ్వరా !అలమేలుమంగా దేవి విధేయురాలై నీ వక్షస్థలంలో దగ్గరగా ఉండగా 1.శ్రీసతి 2.నీల 3.జాంబవతి 4.యమున 5.సత్యభామ 6.భూదేవి 7.రుక్మిణి 8.ఇల అను ఎనిమిది మంది భార్యలందరూ చేసిన సేవ నీకు నేను చేస్తాను. స్వీకరించు.

కన్నులుగల్గి కొమ్మ నిను గప్పముజేకొన లేతనవ్వు నీ

కెన్నడు మోవి నిచ్చినదొ యేగతి మెచ్చితొ యెట్టులుండెనో

యన్నిట, నేనెజాణ నని యందువు శ్రీయలమేలుమంగకే

మన్నన నెట్టు లిచ్చితివో మాటల జిక్కవు వేంకటేశ్వరా! 2

ముఖ్య పదార్థం-

కొమ్మ= ఆడుది; కప్పము= ప్రజలు రాజునకిచ్చెడిధనము; చేకొను= గ్రహించు; జాణ= నేర్పరి, మన్నన= గౌరవము

తాత్పర్యం:

వేంకటేశ్వరా! మా అమ్మ అలమేలు మంగమ్మ నీ దగ్గర మధురమైన ఒక కప్పము తీసుకొందామనుకొంది. ఇంతలేసి కన్నులున్నాయికదా మా అమ్మకి! నిన్ను చూస్తూ తన పెదవిపై ఒక లేతనవ్వు మెరిపించింది. ఇంకేముందయ్యా ! పడిపోయావు | ఆ తర్వాత ఎలా ఆవిడని మెచ్చుకొన్నావో , ఆవిడ నీతో ఎలా ఉందో ఆ కథా కార్యక్రమం మాకు తెలియదు కాని - మాతో మాత్రం 'అన్నిట్లో నేనే నేర్పరిని' అంటావు. అవునయ్యా ! మా అల మేలు మంగమ్మకి ఏమి గౌరవాలిచ్చావు తండ్రి | కొంచెం వివరించవయ్యా బాబూ ! అసలు నువ్వు మాటలలో చిక్కవు . ఎంత గుంభనం మహా ప్రభో ! వేంకటేశ్వరా!

కిలకిల నవ్వు నవ్వి తిలకించితి మంచి సుధారసంబు నీ

పలుకు తేనెలన్ విభుని బట్టము గట్టితినీదు కౌగిటన్

వలదని చెప్పినన్ వినవు వద్దుసుమీ యలమేలుమంగ నీ

కెలవు లటంచు నెచ్చెలులు కీర్తన సేతురు వేంకటేశ్వరా ! 3

ముఖ్య పదార్థం –

తిలకించు= ప్రకాశించు; కెలవు - అనురాగము; నెచ్చెలి= స్నేహితురాలు.

తాత్పర్యం:

ఈ పద్యంలో వేంకటేశ్వరా అను సంబోధన అలమేలు మంగకి సంబంధించినది. ఓ అలమేలు మంగా ! కిల కిలా నవ్వి నువ్వుమెరిసిపోతుంటావు. నీ మాటలలో తేనెలు కురిపించి , మా ప్రభువు వేంకటేశ్వరునికి నీ కౌగిట్లో పట్టాభిషేకం చేసావు. నీ నవ్వులును, కౌగిటి సరాగాలను అనురాగాలుగా నీ స్నేహితురాళ్ళు కీర్తన చేస్తుంటారు.

నీవును దాను గూడె దరుణీమణి శ్రీయలమేలుమంగ నా

నావిధవైభవంబుల ననారతముం జెలువొందు నేడు నీ

వావలి మోము చేసి తని యప్పటినుండియుబల్క విట్టులా

దేవర చిత్తమెవ్వరికిదేర్పగ శక్యమె వేంకటేశ్వరా ! 4

ముఖ్య పదార్థం-

తరుణి =యౌవనముగలఆడుది; అనారతము=ఎల్లప్పుడు; చెలువు= అందము,

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! నువ్వు, యౌవనవంతురాలు అలమేలు మంగమ్మ నానా విధములైన వైభవములతో చక్కగా చూడముచ్చటగా కలిసిమెలసి ఉన్నారు. ఇంతలో ఏమయింది తండ్రీ ! ఉన్నట్టుండి, నీ పక్కన ఉన్న మా అమ్మను చూడకుండా మొగం పక్కకి తిప్పుకొన్నావు. ప్రభువుల మనస్సు తెలుసుకోవటం కష్టం. ఎప్పుడు అనుగ్రహం వస్తుందో! ఎప్పుడు ఆగ్రహం వస్తుందో చెప్పటం కష్టం. మా వల్ల కాదు బాబూ!

ఓ లలితాంగి!యోకలికి ! యో యెలజవ్వని యో వధూటి | యో

గోల | మెఱుంగుజూపుకనుగోనల నోయలమేలుమంగ మ

మ్మేలిన తల్లి నీవిభున కించుక మాదెసచూపు మంచు నీ

పాలికి జేరి మ్రొక్కుదురు పద్మభవాదులు వేంకటేశ్వరా ! 5

ముఖ్య పదార్థం-

లలితాంగి=అందమైన శరీరము గల స్త్రీ; కలికి =చక్కని ఆడుది; ఎల జవ్వని =యౌవనవతి, వధూటి= ఆడుది, కన్యక, గోల= ముగ్ధ,ఉదయించుచున్న యౌవనముగలది. పండ్రెండేండ్ల పర్యంతమైన వయసుగలది; మెఱుంగు-కాంతి;పద్మ భవ= బ్రహ్మ (పద్మమునందు పుట్టినవాడు)

తాత్పర్యం:

అమ్మా | అలమేలు మంగమ్మా ! నీ అందమైన కళ్ల చివర కాంతి ప్రదర్శిస్తూ మమ్మలిని కాపాడుతుంటావు. నీ భర్తగారు - వేంకటేశ్వరుని దయ పొందటానికి -బ్రహ్మ మొదలైన వాళ్లు నీ దగ్గరికి చేరి మొక్కుతుంటారు. (అయ్య దయ కోసం అమ్మ సిఫారసు)

చికురభరంబుచే నదిమి శ్రీలలితాంగివి నీవు నాగుణా

ధికునియురమ్ముపై రతులదేలుచు శ్రీయలమేలుమంగ నీ

లికచకుచ ప్రభావమున లేతవయస్సున నింత నేతురా

వెకలి వటంద్రు నెచ్చెలులు వేడ్కల నీసతి వేంకటేశ్వరా 6

ముఖ్య పదార్థం-

చికురము =కదలునది,వెంద్రుక ;నీలి- నల్లనిది;వెకలి = వెఱ్ఱి, వేడ్కల=వినోదముల.

తాత్పర్యం:

ఓ అలమేలుమంగా ! నువ్వు నీ భర్త వేంకటేశ్వరునితో రతి క్రీడ సాగించే వేళలో - నీ భర్త రొమ్మును నీ నల్లని జడలతో అదిమి పెడుతున్నావు."అయినా ఇంత చిన్న వయస్సులో నల్లటి జడలు, కుచాల ప్రభావం భర్త మీద ఇంతగా చూపిస్తారా?" అనినీ స్నేహితురాల్లు నీతో వేళాకోళమాడుతుంటారు. (ఈ పద్యంలోని వేంకటేశ్వర సంబోధన అలమేలుమంగకు సంబంధించినది.)

ఒక మరినీవు కన్గొనల నొయ్యనజూచిన నీవిభుండు లో

గకవికదర్పు జేరునట కౌగిటి కోయలమేలుమంగ నీ

వికచ విలాస మంచు నరవింద మరందపుదేనెపల్కులన్

బిక శుకపంక్తి నీకు దలపించును నీసతి వెంకటేశ్వరా! 7

ముఖ్య పదార్థం-

ఒయ్యన= మెల్లన; కకవిక=అల్లరి; వికచము= వికసించినది; తలపించు=జ్ఞప్తికి తెచ్చు.

తాత్పర్యం:

ఓ అలమేలు మంగా ! ఒక్కసారి నీ కళ్ల చివరగా మెల్లగా ప్రేమని నింపి చూసావా చాలు! మా వెంకటేశ్వరుడు మనస్సంత అల్లరి అయిపోయి నీ కౌగిటిలో చేరి పోతాడు. తేనెలాంటి నీ పలుకులు వింటుంటే కోయిలలు, చిలుకలు జ్ఞప్తికి వస్తుంటాయి.

కూరిమి సానపట్టిన చకోరపుగన్ను గొన దళుక్కునన్

జేరువ మించులై మెఱయ జిమ్ములబొమ్మల బంపు నవ్వు దై

వారగ గాంచి నీతరుణి వన్నెల శ్రీయలమేలుమంగ నీ

**సారపు నేర్పు జక్కగొనె జక్కని మోమున వెంకటేశ్వరా! 8**

**ముఖ్య పదార్థం-**

**కూరిమి= ప్రేమ; సానపట్టిన= మెరుగుపెట్టు;చకోరము= వెన్నెల పులుగు (వెన్నెల చూచి తృప్తి పొందునది). దైవారగ= అతిశయించు.**

**తాత్పర్యం:**

**వేంకటేశ్వరా ! నువ్వు తక్కువ వాడివి కాదు. ప్రేమతో మెరుగు పెట్టిన నీ చకోరపు కన్ను చివరలలో అలమేలు మంగమ్మను చూచి ఒక్క నవ్వు నవ్వావు. మా అలమేలు మంగమ్మ ఆ నవ్వు మెరుపులలో మునిగిపోయి అతిశయించిన సొంపులతో నీ కంటి నేర్పును గ్రహించి చక్కటి మోముతో ప్రకాశించింది.**

**ఆయలసంబు లానడపు లాకనుగ్రేవల ముద్దుచూపు లా**

**యాయెలనవ్వు మాటల ప్రియంబులు నీకలమేలుమంగ నీ**

**మాయలో ప్రాణవల్లభుని మక్కువ చేతలొ చెప్ప మంచు లే**

**బ్రాయపు నీసతిం జెలులు పల్కిరి పల్మఱు వేంకటేశ్వరా | 9**

**ముఖ్య పదార్థం-**

**అలసంబులు= శ్రమచెందుటలు,సోమరితనముగా ఉండటం;క్రేవల= పార్శ్వముల; ఎలనవ్వు= చిరునవ్వు: లేబ్రాయపు= బాల్యపు;**

**తాత్పర్యం:**

**'అలమేలు మంగా ఏమిటే సంగతి! బాగా శ్రమ చెందినట్టు ఈ ఒళ్లు బద్ధకమేమిటి? !ఆ కళ్ళ చివరగా ముద్దు చూపులు, ఆ చిరునవ్వులు, మాటల్లో కొత్తకొత్తగా ప్రియమైన సంగతులు -ఏమిటే ఏం కథ జరిగింది?**

ఇవి నీ మాయలా ? నీ ప్రాణ వల్లభుడు వేంకటేశుల వారి చేతలా ? చెప్పమ్మా ! "అంటూ బాల్య స్నేహితురాళ్లు అలమేలు మంగమ్మను మాటి మాటికి ఆట పాటిస్తున్నారని . వేంకటేశ్వరునికి -అన్నమయ్య ఈ పద్యంలో- తెలియ చేస్తున్నారు.

కిన్నెర మీటి మీటి పులకించి తలంచి మనోజలీల దా

నున్న తెఅంగు నెచ్చెలుల కొయ్యనజెప్పగబూను జెప్పరా

కన్నువ సిగ్గుతో నలరు నల్లన శ్రీయలమేలుమంగ నీ

వన్నెలసేత లెట్టివా సువాళము లెట్టివొ వేంకటేశ్వరా 10

ముఖ్య పదార్థం-

కిన్నెర =వీణా విశేషము; మనోజుడు =మన్మథుడు;ఒయ్యన-మెల్లన అన్నువ= అల్ప ము;అల్లన= మందముగా వన్నెలు= కళలు;సువాళము= చేష్టలు (ప్రకరణార్థం)

తాత్పర్యం:

స్వామీ | వెంకటేశ్వరా! అలమేలు మంగ ఆ వీణను మీటుతున్న సమయంలో , తమరు చేసిన మన్మథ చేష్ట ఏదో గుర్తుకు వచ్చి, పులకించి పోయింది. ఆ చేష్టను తలచుకొని, మెల్లగా దానిని చెలికత్తెలకు చెప్పాలనుకొంది. చెప్పటానికి సిగ్గు అడ్డు వచ్చింది. ఇంతకీ తమరు చేసిన ఆ కళలు ఏమిటో | ఆ చేష్టలేమిటో ! ఏ విధంగా ఉన్నాయో!

నరసిజసంభవాది దివిజప్రకరంబులసంపదల్ సువి

స్తరములు గాగ గన్గొనల జల్లెడు శ్రీ యలమేలుమంగనీ

తరుణియురంబునంజెలగదన్మయమందెడు నీకు బ్రాతియే

పరమపద ప్రభుత్వము నపారమహత్వము వేంకటేశ్వరా ! 11

ముఖ్య పదార్థం-

సరసిజసంభవ + ఆది = బ్రహ్మ మొదలైన; దివిజప్రకరంబుల = దేవతా సమూహముల, బ్రాతియే = అధికమా? పరమపద= మోక్షము; మహత్త్వము= గొప్పతనము;

తాత్పర్యం:

స్వామీ ! మనలో మాట . బ్రహ్మ మొదలైన దేవతలకు తన కంటి చివర చూపులతో సంపదలు ప్రసాదించే శక్తి కలిగినది మా అలమేలు మంగమ్మ. అటువంటి మా తల్లి నీ వక్షస్థలంలో ఉంటూ తన్మయం పొందుతుంటే, - మోక్షం ఇవ్వటమనేది నీకు గొప్పతనంగా కనిపిస్తోందా? (నీకున్న మోక్షం ఇచ్చే శక్తి కంటే మా అలమేలుమంగ నీ వక్షస్థలంలో ఉండటమే గొప్ప అని కవి చమత్కారం.)

తరుణి! మహా నిధానమ! సుధామయకూపసమస్తవైభవా

భరణమ! దేవదేవుని కృపామతి! యోయలమేలుమంగనీ

కరుణయు జాలు లోకముల గావగ నంచు మునీంద్రులున్

సురల్ నిరతి నుతించి మ్రొక్కుదురు నీప్రియకాంతను వేంకటేశ్వరా ! 12

ముఖ్య పదార్థం-

తరుణి=యౌవనముగల ఆఁడుది; నిధానము=నిధి; సుధామయ= చంద్రుడు; నిరతి మిక్కిలి ఆసక్తి,

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! "తరుణీ ! మహా నిధి కలదానా!చంద్రునివలె ఆహ్లాదం కలిగించే మహా వైభవం కలిగిన దానా ! దేవతలకు దేవతయిన వేంకటేశ్వరుని దయా బుద్ధి యైన దానా ! ఓ అలమేలు మంగా! లోకాలను రక్షించుటకు ని దయ చాలు "అని దేవతలు ఆసక్తితో నీకు చాలా ఇష్టమైన అలమేలుమంగను పొగుడుతూ నమస్కరిస్తుంటారు.

చెదిరిన చిన్ని లేగురులు చెక్కున జాజగ ముద్దుమోముతో

వదలిన కొప్పుతోడ నిడువాలిక కన్నులు నిగ్గు దేఱగా

నుదుటున నిన్ను గూడి మహిమోన్నతితో నలమేలుమంగ నీ

యెదుట మనోజసంపదల నేగతి నుండెనో వేంకటేశ్వరా! 13

ముఖ్య పదార్థం-

నిడువాలిక =పొడవైన; నిగ్గు దేఱగా= వన్నెలుదేఱు; ఉదుటున= ఉద్ధతితో మనోజసంపదల = మన్మథుని సంపదలతో,

తాత్పర్యం:

స్వామీ ! ఉద్ధతితో మా అలమేలు మంగ నిన్ను కలిసే సమయంలో నుదుటిమీద ఉన్న చిన్నవైన వెంట్రుకలు చెదిరిపోయి ఉంటాయి. ముఖం ముద్దుగా ఉంటుంది.కొప్పు విడిపోయి ఉంటుంది. పొడవైన కన్నులు ఇంకా వన్నెలు తీరి ఉంటాయి. నాదొక సందేహం ! ఆ సమయంలో మన్మథుని సంపదలతో మా అమ్మ నీ ఎదుట ఏ స్థితిలో ఉన్నదో ! (సిగ్గా? విజయం సాధించానని గర్వమా ? - ఏమో వేంకటేశా !నువ్వే చెప్పాలి.)

తొలకరిమించు తొయ్యలి వధూమణి చక్కని తల్లి మానినీ

తిలకమ దేవదేవుని సతీమణి యొయలమేలుమంగనీ

సొలవులచూపులేవిభునిచూపులవిందు లటంచు నెచ్చెలుల్

పలుకగ నిన్నుజూచి నగు బైకొని నీసతి వేంకటేశ్వరా! 14

ముఖ్య పదార్థం-

తొలకరి=చైత్ర వైశాఖమాసములలో కురిసే వాన;మించు=మెఱవు: తొయ్యలి=ఆడుది;సొలపు=పారవశ్యము; వైముఖ్యము;పైకొను= హత్తుకొను

తాత్పర్యం:

అలమేలు మంగమ్మను చూసి చెలికత్తెలు "మెరుపుతీగ వంటిదానా ! చక్కని తల్లి! వేంకటేశుని భార్యామణీ ! నీ పారవశ్యంతో కూడిన చూపులు వేంకటేశుని చూపుల విందులు."అని చెప్పగా వేంకటేశుడు ఆ మాటలు విని నవ్వి అలమేలుమంగమ్మను హత్తుకొన్నాడు.

తలచు గరంగు మైమఱచు దన్మయ మందును జిత్తజాగ్నిని

న్నలయుచుదూరు నుస్సురనునర్మిలితో నలమేలుమంగనీ,

వలిగిననంతనే కడు బ్రియంబిక నేమని చెప్పనేర్తువో

కలిగినవింతలందున బ్రకాశముతో చెడు వేంకటేశ్వరా ! 15

ముఖ్య పదార్థం-

తలచు=ధ్యానించు కరంగు=చెమరు,ద్రవించు, మైమఱచు= పారవశ్యము చెందు; తన్మయమందును= పరవశము పొందును,చిత్తజాగ్ని= మన్మథాగ్ని; ఆలయుచు= విసుగు చెందుచు; దూరు= నిందించు ఆర్మిలి= ప్రేమ; కలిగిన= ప్రకాశించిన, ప్రకాశము= తలయాడించుచు నవ్వెడు నవ్వు.

తాత్పర్యం:

వేంకటేశా ! నువ్వు మా అలమేలు మంగమ్మ మీద అలిగినప్పుడు - పిచ్చిదానిలా నిన్నే తలచుకొంటుంది. నీ ఆలోచనలలో కరుగుతుంది. నిన్ను తలుచుకొని పరవశత్వం పొందుతుంది.మన్మథాగ్నితో నీ పైవిసుగు చెంది నిన్ను నిందిస్తుంది. ఉస్సురని నిట్టూరుస్తుంది. ఇక మా అమ్మని ఎలా ప్రసన్నం చేసుకొంటావో ! నీ తల విదిలింపు నవ్వుల వింతలలో కాంతి తోస్తోంది.

నించిన పంచదారలును నేతులు దేనెలు గమ్మగాగదా

లించినకూరలున్ బరిమళించగ నయ్యలమేలుమంగవ

డ్డించిన నిర్మలాన్నములు డెంద మెలర్పగ నారగింతు నీ

మించిన వేయిచేతులను మేలములాడుచు వేంకటేశ్వరా! 16

ముఖ్య పదార్థం-

నించిన= తృప్తి పొందించునట్లుగా; తాలించిన- (కూర మొదలగువాని) తిరుగబోయుట; ఎలర్పు=సంతోషము ; మేలములాడు= హాస్యములాడుచు

తాత్పర్యం:

వేంకటేశా ! మా అమ్మ అలమేలుమంగమ్మ పంచదారలు నేతులు, తేనెలు, కమ్మగా తాలింపు పెట్టిన కూరలు మంచి వాసనలతో వడ్డిస్తుండగా మనస్సు సంతోషించేటట్లు వేయి చేతులతో హాస్యాలాడుతూ తింటున్నావు.నీ భాగ్యమే భాగ్యం.

అతడె నీవు, నీవనగ నాతడు, నీ పలుకే తలంపగా

నాతనివల్కు 'నీ హృదయమాతడె పో 'యలమేలుమంగనీ

చేతిదె సర్వజంతువుల జీవనమంతయునంచు నన్ముని

వ్రాతము సన్నుతించు ననివారణ నీసతి వేంకటేశ్వరా ! 17

ముఖ్య పదార్థం-

వ్రాతము=సమూహము; అనివారణ = ఆటంకములేని

తాత్పర్యం:

"అలమేలుమంగ అంటే నువ్వు. నువ్వంటే అలమేలుమంగ. నీమాటే ఆమె మాట. ఆమె మాటే నీ మాట . నీ హృదయము అంటే వేంకటేశ్వరుడే ! నీ చేతనే ఈ సమస్త లోకము జీవిస్తోంది "అని మునులందరూ నిన్ను , అలమేలుమంగని పొగడుతుంటారు. వేంకటేశ్వర ! నమస్సులు.

లోలవిలోలనేత్రకు దళుక్కున తెప్పలు వంచి యెత్తినన్

మేలిమిజెక్కుటద్దముల మేలములై యలమేలుమంగకున్

నీలపయోదపుందుఋము నిగ్గుతటిల్లతలే యటంచు ను

న్మీలనిమీలనంబులకె మెత్తువు నీవును వేంకటేశ్వరా! 18

ముఖ్య పదార్థం-

లోలవిలోలనేత్రకు = ఆశతో, బాగా చలిస్తూ ఉండే కన్నులు కలది ;మేలిమి= చక్కటి; మేలము పరిహాసము తురుము= కొప్పు నిగ్గు= కాంతి; ఉన్మీలనము వికసించుట, మీలనము= కన్నులు మూయుట

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగ ఆశ నిండారిన , చలిస్తున్న కనురెప్పలు వంచి , మళ్ళీ తల పైకెత్తి నీ కేసి చూస్తోంది. (అంతకు ముందు నువ్వేమి చేసావో మహానుభావా !) కన్నులు తెరుస్తున్నప్పుడు, మూస్తున్నప్పుడు వస్తున్న కాంతులు మా అలమేలు మంగమ్మ చెక్కుటద్దాలలో మెరువుల్లా ప్రతిఫలిస్తుంటే , పరిహాసాలాడుతుంటే మెచ్చుకొంటుంటావు.

పక్ష్మలనేత్ర ! యోచిలకపల్కుల కల్కి ! సరోజవల్లి !యో

లక్ష్మి లతాంగి యోబహుకళావతి యోయలమేలుమంగ నీ

సూక్ష్మ వివేక లీలలకు జొక్కితి నంచు నఖేందువల్లికా

లక్ష్మి వికాసత సతి జెలంగగజేతువు వేంకటేశ్వరా ! 19

ముఖ్య పదార్థం

పక్ష్మలనేత్ర - రెప్ప వెండ్రుకలుకలకన్నులు కలది ; కలికి= చక్కని ఆడుది; నరోజు వల్లి= తామర తీగలతో కూడుకొని ఉండునది;చెలగు=సంతోషించు;

తాత్పర్యం:

ఓ వేంకటేశ్వరా! "రెప్ప వెంట్రుకలు కలిగిన కన్నులు కలిగినదానా! చిలక పలుకులవలె అందంగా మాట్లాడుదానా ! తామర తీగెలతో కూడుకొని ఉండెడి దానా ! ఓ లక్ష్మి దేవీ ! ఓ లతాంగి ! ఓ అలమేలు మంగ ! నీ సూక్ష్మమైన తెలివి తేటలతో చేసే చేష్టలకు చాలా అనంద పడ్డాను. "అంటూ నీ గోళ్ళు అనే

వెన్నెల ప్రకాశము అమ్మ మీద ప్రసరింపచేస్తావు (నఖ క్షతాలు అని భావం) ఆ రకంగా మా అలమేలు మంగని సంతోష పెడుతుంటావు.

లలితపు కంకణాంకలధ్వని ఘల్లని మ్రోయ నుంగరం

బులు మణినీలకాంతుల ప్రభుత్వముతో నలమేలుమంగ గు

బ్బల పెను వ్రేగుతోదుఱుముభారముతో నినుజేరవచ్చునం

దెలుమొలనూలు ఘంటలు బ్రతిధ్వనులీనగవేంకటేశ్వరా ! 20

ముఖ్య పదార్థం

లలితము =అందమైన; కంకణం =కడియము, అంక= పక్క, ప్రభుత్వము = ఆధిపత్యము; వ్రేగు= భారము; తుఱుము= కొప్పు,అందె =ఆడువాండ్రు కాళ్ళకు ధరించెడు నగ, మొలనూలు= ఆడువారు అలంకారార్థము మొలకు ధరించెడు మణులు గుచ్చిన హారము.

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మ నీదగ్గరకు వస్తోంది. ఆ సమయంలో ఆమె చేతికి ఉన్న అందమైన కడియాల ధ్వని ఘల్లని మోగుతున్నాయి. ఉంగరాలలోని ఇంద్రనీలమణి కాంతులు ఆధిపత్యాన్ని ప్రదర్శిస్తున్నాయి. స్తనాల భారంతో , కొప్పు భారంతో నీ దగ్గరికి వచ్చే సమయంలో , ఆమె కాలి అందెలు, మొలనూలు గంటలు ప్రతిధ్వనిస్తున్నాయి.

కుంకుమ కస్తురీ ప్రభ బుగుల్కొన జెక్కుల జార దివ్యతా

టంకమణి ప్రభా ప్రతివిడంబముతో నలమేలుమంగ భ్రూ

జంకెల నందలింపగనె జల్లనెజిత్తము నీకు నంతలో

నంకనమించుమిమ్ముబులకాంకురకోటులు వేంకటేశ్వరా 21

అర్థాలు

కుంకుమ= మనోహరమైన ఒక సుగంధ ద్రవ్యము; కస్తూరి = మనోహరమైన వాసనగల ఒక సుగంధ ద్రవ్యము, ప్రభ= వెలుగు, బుగుల్కొన= పరిమళించగా తాటంకము దంతము లోనగువాని చేత చేయబడిన చెవికమ్మ, ప్రతి విడంబము= ఎదురు సంతోషముతో ; భూజంకెల= కనుబొమ్మసన్నలతో, అందలింపగ = శృంగార చేష్టతో చూడగానే , అంకన= గురుతు ; పులకాంకురకోటులు =గగుర్పాటుల సమూహములు,

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగమ్మకు కుంకుమ, కస్తూరి కాంతులు చెక్కిళ్ల మీద జారుతున్నాయి.చెవికమ్మల కాంతులు వాటితో పై సై అంటున్నాయి. ఆ స్థితిలో మా తల్లి నీకు తన కనుబొమ్మల నన్నలతో ఏవో కమ్మటి కబుర్లు చెబుతుండగా నీ హృదయము ఝల్లంది. నీ గగుర్పాటులు గురుతుకు మించాయి.

కస్తురి పచ్చకప్పురముగమ్మని పుప్పొడి ధూళ్ళు హత్తి శ్రీ

హస్తమునందుతట్టుపునుగందుచు శ్రీయలమేలుమంగ భా

రక్తనవైభవంబులగరంగుచు నిన్ను గఋంగ మెత్తు నీ

కౌస్తుభరత్న సౌధమునకౌగిటిపాన్పున వేంకటేశ్వరా ! 22

అర్థాలు

కస్తూరి =మృగమదము, పచ్చకప్పురము= చల్లదనమును మంచి పరిమళమును గల యొక విధమయిన కర్పూరము; పుప్పొడి =పుష్పములందలి ధూళి, హత్తి= అతికించి; తట్టుపునుగు= తట్టియెత్తిన మేలైన

పునుగు.(పునుగు=వునుగు పిల్లివలన కలుగు సుగంధద్రవ్యము), కఱంగ=ద్రవించగ, కౌస్తుభరత్న= విష్ణు వక్షస్థలమునందలి మణి..

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! కస్తూరి, పచ్చకర్పూరము , పుప్పొడి - వీటన్నింటిని ధరించావు. నీ శుభకరమైన చేతిలో పునుగు సుగంధ ద్రవ్యాన్ని

అందుకొన్నావు. నీ కౌగిలి అనే పడకలో , నీ రొమ్మున ఉన్న మణి అనే మేడలో మా అమ్మ అలమేలుమంగ పెద్దవయిన స్తనముల బరువులో కరిగిపోతూ, ఆమెను నీ ప్రేమలో కరిగిస్తున్నావు.

అందవు కోసియిమ్ము విరు లంచును జేరలమేలుమంగని

న్నందగ గోర జెక్కులటు నొక్కిన నాకునునందవంచున

య్యిందుముఖింబ్రియంబలరనెత్తుచుపువ్వులు కోయజేత

ని ష్యందమరందఘర్మరనసంగతులబ్బెనువేంకటేశ్వరా 23

అర్థాలు

చేరు-సమీపించు; చెక్కులు- చెంపలు, చేత- ప్రయత్నము;

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! "నాకు పూలు అందవు. కొంచెం కోసి ఇవ్వవా !" అంటూ మా అలమేలు మంగ నీ దగ్గరకు వచ్చి అడిగింది. నీ చెంపలు ప్రేమతో నొక్కింది. 'నాకుకూడా అందవే' అని జవాబు చెబుతూ ,ప్రేమతో ఆమె

నడుము పట్టుకొని పైకి ఎత్తావు. 'ఇప్పుడందుతాయి కోయ'మని నువ్వు చెప్పావు. ఆ సమయంలో నీకు పూలలో మకరంద ప్రవాహంలా ఒంటి నిండా ఆ చెమట్ల ప్రవాహ మేమిటయ్యా ! ఏమిటి సంగతి?

ఒక్కొక్కనాటిరాత్రి నకలోన్నతుడైన ఖగేంద్ర మూర్తిపై

నెక్కి వినోదలీలజరియించుచునయ్యలమేలుమంగమొ

మక్కున జేర్చుచు బహువిహారముల వనవీథులంబ్రియం

బిక్కువగా జెలంగువిధ మేమని చెప్పుదు వేంకటేశ్వరా ! 24;

అర్థాలు

ఖగేంద్రుడు =పక్షులకెల్లను రాజు. (గరుడుడు) అక్కుజేర్చ= కౌగిలించు; ఇక్కువ= కళాస్థానము

తాత్పర్యం:

వేంకటేశ స్వామీ ! ఒక్కొక్కసారి రాత్రి పూట అన్నింటియందు పెద్దవాడైన గరుత్మంతునిపై , మా అమ్మ అలమేలుమంగతో తిరుగుతున్నావు. ఆ సమయంలో మా అమ్మ అలమేలు మంగను కౌగిలిలో చేర్చుకొంటూ , అనేక విహారాలు చేస్తూ , చక్కటి ఉద్యానవనాలలో తిరుగుతూ , ప్రేమతో కళాస్థానాలు అంటుతూ , నువ్వు చేసే హడావుడి ఏమని వర్ణించమంటావు స్వామీ!

దుగ్ధపయోధికన్య జలధుల్ జగముల్ దనకుకైనున్నసు

స్నిగ్ధకృశోదరాంగి తులసిం బ్రియురాలలమేలుమంగయీ

... ....... ....... .... నుచు నిన్ను మునీంద్ర కన్యకల్

**దిగ్ధరణీధరంబుల నుతింతురు నవ్వుచు వేంకటేశ్వరా ! 25**

**అర్థాలు**

**దురవయోధికన్య= పాలసముద్రపు కన్య (లక్ష్మీ దేవి) ; జలధుల్ =సముద్రములు జగముల్ = లోకములు తన కుక్షి నున్న = తన పొట్టలో ఉన్న  సుస్నిగ్ధ కృశోదరాంగి= నునుపుదనము గలిగిన సన్నని నడుము కలిగినది తులసి - పవిత్రమైనది**

**తాత్పర్యం:**

**వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగమ్మ నడుము చాలా సన్ననిది. కాని తన సన్నని నడుములో విశాలమైన సముద్రాలు, లోకాలు ఎలా ఉన్నాయని ఆశ్చర్య పోతూ మునీంద్ర కన్యకలు దిక్కులన్నింటిలో ప్రతిధ్వనించేటట్లు నిన్ను పొగుడుతుంటారు. (వేంకటేశుని పొగిడినా అలమేలుమంగను పొగిడినట్లే. )**

**పాయని జాజిపువ్వులనే పట్టుక బాయ .......**

**........రాహుతుడావైనపుడాయలమేలుమంగని**

**శ్రేయసలక్ష్మి నీశరము చెంగట నొప్పెదురుష్క దేసబి**

**బ్బీయెలపువ్వు పయ్యెదనె ప్రేమపునువ్వున వేంకటేశ్వరా ! 26**

**అర్థాలు**

**పాయని= విడుచు, నిశ్శ్రే యసలక్ష్మి= మోక్షపులక్ష్మి చెంగట= సమీపము, తురుష్కదేసబిబ్బీ = తురుష్కుల అంతఃపుర స్త్రీ, ఎల=స్వల్పము;**

**తాత్పర్యం:**

ఓ వేంకటేశ్వరా ! మా అమ్మ మోక్షపు లక్ష్మి - అలమేలు మంగమ్మ జాజి పువ్వులను విడువక ధరించింది. నీ చూపుల బాణము తగిలి , తురుష్కుల అంతః పుర స్త్రీలా - నీ ప్రేమ కదిలిస్తుండే సగమైన పూల పయ్యెదను ముసుగులో దాచుకొంది.

యో చెలి! యో లతా ప్రతిమ! యో మృగలోచన! యోచకోరిరో!

యో చదులాల !యోచిలుక ! యోనవలా యలమేలుమంగ నీ

చూచిన చూపులే విభుడు చూచినచూపులటంచు నీసతిన్

ఖేచరసిద్ధి కామినులు కీర్తన సేతురు వేంకటేశ్వరా! 27

అర్థాలు:

లతా ప్రతిమ= తీగతో పోలిక గలదానా ! మృగలోచన =జింక వంటి కన్నులు కలదానా !; చకోరము=వెన్నెల చూచి తృప్తి పొందు చకోర పక్షి వంటి దానా !;చదులాల= సమర్ధురాలా ! నవలా = స్త్రీ ; ఖేచరసిద్ధి కామినులు= ఆకాశంలో తిరిగే సిద్ధులకు సంబంధించిన స్త్రీలు.

తాత్పర్యం:

ఓ వేంకటేశ్వరా! నీ భార్య అలమేలు మంగమ్మను ఆకాశంలో తిరిగే సిద్ధులకు సంబంధించిన స్త్రీలు "ఓ స్నేహితురాలా! తీగతో పోలిక గలదానా ! జింక వంటి కన్నులు కలదానా ! వెన్నెల చూచి తృప్తి పొందు చకోర పక్షి వంటి దానా! సమర్ధురాలా !నువ్వు చూసిన చూపులే నీ భర్త చూసిన చూపులని పొగుడుతుంటారు.

విశేషములు:

1.అలమేలు మంగమ్మకు , వేంకటేశ్వరునికి మధ్య తేడా లేదని 'నువ్వు చూసిన చూపులే నీ భర్త చూసిన చూపులననే భావంలో కవి చెప్పాడు. 2.పద్యంలో యోచిలుక ! యోనవలా యలమేలుమంగ అను పద సంపుటిలో ఓ... లాయల మేలుమంగ అని మూలప్రతిలో ఉంది. మధ్యలో నవ శబ్దాన్ని ఈ వ్యాఖ్యాత చేర్చాడు. ఇంతకంటే మంచి పదం ఎవరైనా సూచిస్తే నవరించుకొంటాను.

మంగళమమ్మకున్ నకలమంగళ మంబుజనేత్రికిన్ జయా

మంగళ మిందిరా నతికి మంగళమీయలమేలుమంగకున్

మంగళమందు నేమరియు మంగళమందును దేవలోకది

వ్యాంగనలెల్ల నీసతికి నారతులిత్తురు వేంకటేశ్వరా ! 28

అర్థాలు :

మంగళము= శుభము, క్షేమము; ఆరతి= దేవుని నమకమున దీపధూపముల త్రిపుట (రూ. హారతి,)

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మకు శుభము కలుగు గాక! పద్మములవంటి కన్నులు కలిగిన మా అమ్మకు శుభము కలుగు గాక!లక్ష్మీ దేవికి శుభము కలుగు గాక!అలమేలు మంగమ్మకు శుభము కలుగు గాక!'నేను మంగళమంటానే ! కాదు నేను ' అంటూ దేవలోకంలోని దేవతా స్త్రీలందరూ నీ భార్య అలమేలు మంగకు హారతులిస్తున్నారు.

వెలది మహాపరాధములు వేయును వేసితి గావుమన్న నీ

పులకలు మేనిఘాతలును బూతలు జూ చలమేలుమంగనీ

యలకలు దీర్చి చెక్కు చెమటల్లన గోళ్ళను జిమ్మి పయ్యెదన్

బలుచని నవ్వుతో విసరుబై చెమటారగ వేంకటేశ్వరా ! 29

అర్థాలు :

వెలది = నిర్మలమైన స్త్రీ; ఘాత=గాయము;

తాత్పర్యం

వేంకటేశ్వరా ! ఒకసారి నువ్వు మా అమ్మ అలమేలు మంగమ్మ దగ్గరికి వెళ్లి " ఓ నిర్మలమైన స్త్రీ ! నేను గొప్ప తప్పులు చాల చేసాను. నన్ను రక్షించు " అని ప్రార్థించావు. అప్పుడు అలమేలు మంగ నీ శరీరంలోని పులకలు , శరీరంలోని గాయాలు , చందనపు పూతలు - ఇవన్ని చూసి , చెదిరిపోయిన నీ వెంట్రుకలను సరి చేసి ,నీ చెక్కిళ మీద ఉన్న చెమటలను గోళ్లతో చిమ్మి తన పయ్యెదతో , పలుచని నవ్వు నవ్వుతూ చెమట ఆరేటట్లుగా నీకు విసురుతుంది.

ఏ చతురత్వ మేమహిమ మేమి విలాస మదేమి విభ్రమం

బీ చెలువంపు సంపదయు నిందుముఖుల్ జగదేకమోహినుల్

చూచి తలంట వేడ్కపడి చూతురు నీయలమేలుమంగ లీ

లాచికురంపు గ్రుమ్మెడి కెలంకుల నిగ్గులు వేంకటేశ్వరా ! 30

అర్థాలు:

చతురత్వము=నేర్పు: చెలువము= అందము,సౌందర్యము, ఇందుముఖి= చంద్రుని వంటి ముఖముగల స్త్రీ! తలంట = తలమీద నూనెరాచు, చికురము= వెండ్రుక: గ్రుమ్మెడి=నలియఁగొట్టు; కెలంకుల నిగ్గులు=దిక్కుల లోని అందాలు.

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగకి తలంటే సందర్భంలో అద్భుతమైన ఆమె కేశ సౌందర్యము చూసి ఏమి అందము? ఏమి కాంతి ? ఎంత ఆశ్చర్యము? "అంటూ చెలికత్తెలు ఆనంద పడతారు. దిక్కులలో ఉన్న అందాలను అలమేలు మంగ కేశ సంపద కాంతులు మీరెంత అని నలగ్గొడతాయి. (అలమేలు మంగ కేశ సంపద అందమైనది అని భావం)

పరిమళమో కదంబమో ప్రభల్ విడ నించినని'' నిర్మలా

భరణమొ నిత్యవైభవమొ భాగ్యమొ శ్రీయలమేలుమంగ భూ

ధరునకు నాదిలక్ష్మి యని తత్త్వమహత్త్వరహస్యవేత్తలం

బరమున నుండి నీవనిత ప్రస్తుతి సేతురు వేంకటేశ్వరా ! 31

అర్థాలు:

పరిమళమో= 1.మెదుపుటవలన రాపిడివలన పుట్టిన వాసనయో | 2.సురతమున నలిగిన మేనుపూత మొదలైన వాటి వలన పుట్టిన వాసనయో, కదంబమొ=పలు రంగుల పూలతో కట్టిన దండ యో : ప్రభల్ = వెలుగులు: విడ నించిన= నించిన; నిగ్గొ= గొప్ప కాంతియో

తాత్పర్యం:

వేంకటేశ్వరా! నీ భార్య అలమేలు మంగమ్మను సువాసన అని, పలు రంగుల పూలతో కట్టిన దండ అని, వెలుగులు విడిపోవగా వెలువడిన గొప్ప కాంతి అని, స్వచ్ఛమైన ఆభరణమని, నిత్య వైభవమని, సంపద అని, భూమిని ధరించిన నీ ఆది లక్ష్మి అని, తత్వ రహస్యములు బాగా తెలిసినవారు ఆకాశమున ఉండి పొగుడుతుంటారు.

తిరమగు మంచి కుందనపుదీగపయిన్ ఘనచక్రవాకముల్

పరగినరీతి జన్నుగవ భావముతో నలమేలుమంగ నీ

యురముపయిం జెలంగగని యోగిజనంబులు నీలమేఘవి

స్ఫురణముతోడి మించనుచుజూచి నుతింతురు వేంకటేశ్వరా! 32

అర్థాలు:

తిరమగు= స్థిరమగు;కుందనపుదీగ=మేలిమి బంగారపు తీగపై ; ఘన చక్రవాక ముల్ = గొప్పవైన జక్కవపక్షులు;మించు=మెఱపు:

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! స్థిరమైన మంచి బంగారపు తీగపై చక్రవాక పక్షులు ఉన్నట్టుగా , మేలిమి బంగారపు తీగవంటి తన శరీరముపై స్తనముల జంట ప్రకాశిస్తుండగా , నీ రొమ్ముపై వాలిన అలమేలు మంగమ్మను చూచి యోగివరులు, మేఘము మీద మెరపు ఉన్నట్లున్నదని పొంగిపోతుంటారు. (మేఘము= వేంకటేశ్వరుడు; మెరపు= అలమేలుమంగ)

కొలదికిమీఱు గ్రొవ్విరులు కొప్పునజాఱగ జూపుకన్నులన్

గులుకుచు నుండ నెన్నుదుటికుంకుమతో నలమేలుమంగ వె

న్నెలనును దీగయై కళలునించిన పుత్తడి బొమ్మయై నినుం

గలికి కరంబునం జెనయ గంటిరిగా తమి వేంకటేశ్వరా! 33

అర్థాలు:

కొలదికిమీఱు- అధికమగు, క్రొవ్విరులు- కొత్తపువ్వులు, కొప్పున = తలయందు దోపిన వెంద్రుకలముడిలో, నెన్నుదుటి-చక్కనైన నుదుటి, ననుదీగయై- ననుపైన తీగయై, నించిన -నిండిన, పుత్తడి బొమ్మయై= బంగారు బొమ్మయై, చెనయ-తాకగా తమి- మోహాన్ని, వలపును

తాత్పర్యం:

వేంకటేశ్వరా! కొప్పున పెట్టుకొన్న అధికమైన పూలు జారుచుండగా, కళ్లు కులుకును చూపుతుండగా , చక్కనైన నుదుటి కుంకుమతో మా అలమేలు మంగమ్మ ననుపైన బంగారపు తీగయై , కళలు నిండిన బంగారు బొమ్మయై నీ దగ్గరకు వచ్చి తన అందమైన చేతితో నిన్ను తాకింది. ఇంకేముంది! వలపు యొక్క తృప్తిని ఇద్దరూ పొందారు.

పెడమర చూచి చూపు జళిపించిన నెట్లు ధరింతువో ప్రియం

బడరగగౌను దీగ నులియన్ _ _ _..నన్

సడివడి యెంతవేగుదువో చక్కని శ్రీయలమేలుమంగ నీ

వెడవగు మోముజూచి నగి వెన్నెల చల్లిన వేంకటేశ్వరా ! 34

అర్థాలు:

పెడమర -వెనుకకు తిరుగు. జళిపించిన –ఆడించిన, అదరగ –వ్యాపించగా, కౌనుదీగ - తీగవంటి నడుమును, నులియన్ = చలించగా, ఏదైననొకటి తాకుటచే స్థానము తప్పి యిట్టట్టు తొలగుట నులియుట) సడివడి = వేగమైన సైగ, వేగుదువో –తపించెదవో,వెడవు - -కొంచెము

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగమ్మ ఒకసారి వెనుకకు తిరిగి నిన్ను శృంగార భరితమైన ఓర చూపు చూసింది.తన తీగవంటి సన్నని నడుమును కొంచెము కదిలించింది.ఒక రకమైన వేగంతో కూడిన

సైగ చేసింది. పాపం! నువ్వు ఎంత తపించి ఉంటావో !ఆ స్థితిలో ఉన్న నిన్ను చూసి మా అమ్మ నవ్వులలో వెన్నెలలు కురిపిస్తూ ఉన్నది.

....... గుజ్జెన గూళ్ళును బైడిపాళ్ళు మా

యమ్మకు బొమ్మరిళ్ళు లలితాంగికి మాయలమేలుమంగకున్

బొమ్మలు బొమ్మ పొత్తికలు బోనపుదొంతు లటంచు నీసతిన్

నెమ్మి భజించి మ్రొక్కుదురు నిర్జరకాంతలు వేంకటేశ్వరా 35

అర్థాలు:

గుజ్జన గూళ్ళు =1.బాలక్రీడావిశేషము; 2. బాలికలాడుకొనునప్పుడు చిన్న పిడతలతో వండిన వంటకము,పాళ్ళు- బాలక్రీడావిశేషము(పాళ్ళు అని అన్నమయ్య ప్రయోగము. కాని తెలుగు పర్యాయపద నిఘంటువులో (జి.యన్.రెడ్డి బాల్య క్రీడలకు పర్యాయ పదంగాపాళ్ళులు పేర్కొనబడింది.) బొమ్మరిల్లు = బాలికలు బొమ్మల నుంచి ఆడుకొనెడు చిన్నయిల్లు, పొత్తిక = మెత్తని సన్నని చిన్న వస్త్రము బోనపుదొంతులు = భోజన పాత్రల వరుసలు, నెమ్మి- ప్రేమ, స్నేహము

తాత్పర్యము :

ఓ వేంకటేశ్వరా ! నీ భార్య అలమేలుమంగను దేవతా కాంతలందరూ గుజ్జనగూళ్లతో, బొమ్మరిళ్లతో బోనపుదొంతులతో ప్రేమతో కొలుస్తుంటారు

విశేషాలు

"రే లమృతాంశులో శశము రెమ్ముద మంచుఁ దలంచి జాళువా

మేలి పసిండి సోయగఁపు మేడల గుజ్జనగూళ్ల సందడిన్

బాలిక లుండి యావలం జనం గని చింతిలి "వంటయింటి కుం

దే లి"ది యెందుం బోంగలదు నేంటికి నే’’మని యందురందులన్" అంటూ విజయవిలాస కవి ఈ గుజ్జనగూళ్ల ప్రస్తావన అందంగా చేసాడు.

ఓ కమనీయ కంజముఖి ! యోవలరాయని తల్లి! యోసుధా

సైకత చాతురీజఘన చక్రిణీ ! యోయలమేలుమంగ ! నీ

వే కరుణించి కావుమని వేడ్కల నింద్ర పురంధ్రు లందఱున్

బైకొని నీలతా ప్రతిమ బ్రస్తుతి సేతురు వేంకటేశ్వరా! 36

అర్థాలు:

కంజముఖి = తామర పువ్వు వంటి మోము కలదానా ! వలరాయని తల్లి = మీ మన్మథుని తల్లీ ! సుధా సైకత చాతురీజఘన చక్రిణీ =సున్నపు ఇసుక దిబ్బలవంటి నేర్పు కలిగిన జఘన చక్రములు కలదా నా ! పురంధ్రులు = స్త్రీలు: లతా ప్రతిమ = తీగవలె సన్నగా ఉన్న, ప్రస్తుతి సేతురు = పొగడెదరు, పైకొను =అతిశయించు

తాత్పర్యము :

ఓ వేంకటేశ్వరా ! "తామర పువ్వు వంటి మోము కలదానా ! ఓ మన్మథుని తల్లీ ! సున్నపు ఇసుక దిబ్బలవంటి నేర్పు కలిగిన జఘన చక్రములు కలదానా ! ఓ అలమేలుమంగా ! నువ్వే మమ్ములను దయతో కాపాడవలెనని ఇంద్ర స్త్రీలు తీగవలె సన్నగా ఉన్న నీ భార్యను (అలమేలుమంగను) పొగుడుతుంటారు.

జాగరమేల జేసెదవు చంద్రనిభానన పవ్వళింపు నీ

భోగపరిశ్రమంబులకు భూషణమై యలమేలుమంగ నీ

యోగవియోగలీల లని యోగికన్యలు నీవధూటి నా

యాగతి బుజ్జగింతురు మహావినయంబున వేంకటేశ్వరా ! 37

అర్థాలు:

జాగరము = రాత్రి మేలుకొని యుండుట. చంద్రనిభానన = చంద్రునితో సమానమైన మోము కలదానా !

పవ్వళింపు- శయనము, వధూటి = స్త్రీ

తాత్పర్యము :

వేంకటేశ్వరా ! నువ్వు ఒకసారి రాత్రి పూట మా అమ్మ దగ్గరికి రావటం ఆలస్యం చేసావు. (పాపం ఏ భక్తుడు నిన్ను శరణు అన్నాడో) ! నీకోసం మా అమ్మ జాగారం చేసింది. చుట్టు ఉన్న చెలికత్తెలు ‘‘అమ్మా ! నిద్ర పో తల్లీ ! నీ భర్త వచ్చిన తరువాత జరిగే భోగ పరిశ్రమకు చాల అలసిపోతావు. సంయోగము, వియోగము రెండూ కూడా లీలలే... ముందుగా నిద్ర పోతే కొంచెం హాయిగా, అలంకారంగా ఉంటుం'దని, అలమేలుమంగను నిద్ర పుచ్చటానికి మహావినయముతో ఆమె చెలికత్తెలు బుజ్జగిస్తుంటారు.

పల్లవపాణి విశ్వగురుభామిని యిట్టి ప్రపంచమంతకున్

తల్లి సమస్తజీవులనిధానమ శ్రీయలమేలుమంగ నీ

చల్లని చూపు చిల్కి వెదజల్లగ పుణ్యులమైతి మంద్రు భూ

మెల్లను నీవధూమణి ననేకవిధంబుల వేంకటేశ్వరా ! 38

అర్థాలు:

పల్లవపాణి=చిగురువంటి మెత్తనైన చేతులు కలది;భామిని=క్రీడాసమయమందు కోపము చూపెడు ఆడుది; నిధానమ=ఆశ్రయము; వధూమణి = భార్య

తాత్పర్యము :

వేంకటేశ్వరా ! ఈ ప్రపంచములో అందరు నీ భార్య అలమేలుమంగమ్మను చిగురువంటి చేతులు కలదని, ప్రపంచమునకు గురువైన స్వామి భార్యవని, ప్రపంచానికి తల్లి అని సమస్త జీవులకు ఆశ్రయ అని, ఆమె చల్లని చూపు సోకితే పుణ్యము లభించినదని పొగుడుతుంటారు.

చెఱగిడగా నదల్చెదవు చేరిన దిట్టెదు కౌగిలించినన్

గొఱతలె యెన్న జూచెదవు కోపము నందమేలుమంగ నా

వెఱ పికనైన దీర్పుమని వేడ్కల నీవు మనోజలీలలన్

దటితటినింతిగూడుటలుదత్త అపాటులువేంకటేశ్వరా! 39

అర్థాలు:

చెఱగిడగా= కొంగు ఇవ్వగా : అదల్చెదవు = గద్దించెదవు;చేరిన = దగ్గరకు చేరితే, కొఱతలె-తక్కువలు, వెఱపు = భయము ;తటితటి=ప్రయత్నించి తత్తఅపాటులు = కలవరపాటులు

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మ నీపై అలిగింది. ఆ సమయంలో ఆమె దగ్గరికి వెళ్లి ఆవిడ కొంగు పట్టుకొన్నావు. ఆమె గద్దించింది. ‘‘ఎందుకు అలా గద్దిస్తావు? దగ్గరికి చేరానని అలుసా ? తక్కువగా చేసి మాట్లాడతావు? నువ్వలా ఉంటే నాకు భయమేస్తుంది.కలవరం కలుగుతుంది. నా భయము, ఆందోళన తీర్చు "అంటూ మన్మధలీలలతో మా అమ్మ దగ్గర ప్రయత్నాలు చేసి విజయం సాధిస్తావు.

కోపము నందల మేలుమంగా నుందనోపు

రాపుగ మమ్ము నేయునపరాధశతంబుల సంతముల్

సదా..............................................................

కాపురమున్ నిరంతరము కల్కితనంబును వేంకటేశ్వరా! 40

అర్థాలు:

(రాపుగ=నిప్పు అంటుకొను నటుల :కలికితనము=చక్కతనము) (వివరించాలనుకొన్న ఈ 40 వ పద్యం సంపూర్తిగా దొరకలేదు. అది సాహితీపరుల దురదృష్టము)

వెలయ వసంతవేళ వనవీధుల సంపగిపువ్వుటిండ్లలో

నలరు చుబుష్పవృష్టి నలపార్చుచు నీ వలమేలుమంగతో

నలరగ నేగి వచ్చి యల పొరగగస్తురినీట మజ్జనం

బెలమి వహించి గంధతతు లిన్ని యుగ్రమ్మఱ మజ్జనంబు పెం

పొలయగనాడు తీర్థముల నుబ్బు పయోధులు వేంకటేశ్వరా ! 41

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! నువ్వు మా అమ్మ అలమేలుమంగమ్మతో కలిసి అడవులలోని వీధులలో ఉన్న సంపంగి పూల ఇండ్లలో అలసిపోయావు. ఆ అలుపు పోగొట్టడానికి పైనుంచి పూల వాన కురిసింది. (నువ్వే కురిపించి ఉంటావు..అవునా !) అలా పూల వాసనతో మా అమ్మ అలుపు పోగొట్టి ఆమెతో కలిసి ఇంటికి వచ్చి కస్తూరి కలిసిన నీటిలో స్నానం చేసావు. నువ్వు స్నానం చేస్తుంటే కస్తూరి వాసనలు ఇంకా

గుబాళించాయి. తీర్థాలన్ని పట్టరాని సంతోషంతో పరవశించిపోయి విస్తారంగా ప్రవహిస్తే , సముద్రాలు వేగంగా తనలో కలుస్తున్న తీర్థాలతో ఉబ్బి పోతున్నాయి.

వెలయగ వేంకటాచలమువీథులగమ్మ నిపుష్పవృష్టి కిం

పలరగ నేగి వచ్చి యలపారగ నయ్యలమేలుమంగతో

నలరగగోరకమ్ముల లతాంగన లిమ్ముల సేస జల్లగా

గలకల నవ్వు మిమ్ము గలకంఠశుకావలి వేంకటేశ్వరా ! 42

అర్థాలు

వెలయగ= ప్రకాశించగా, ఇంపు=ఆనందము;కోరకము=మొగ్గ; సేస=అక్షత :ఇమ్ములు=(సంఖ్యావాచకం)అనేకమని భావం; కలకంఠ= అవ్యక్త మధురమైన ధ్వనులతో; కావలి= చిలుకల సమూహము;

తాత్పర్యం:

వేంకటేశ్వరా !మా అమ్మ అలమేలుమంగమ్మతో కలిసి వేంకటాచలము వీధులలో షికారుకు వెళ్లావు. అక్కడ మీపై కమ్మటి వాసనలు ఉన్న పూలు వానగా కురిసాయి. ఎంతో సంతోషించిన మీపై లతలనే స్త్రీలు లెక్కలేనన్ని మొగ్గలనే అక్షతలను (తలంబ్రాలను) చల్లాయి. ఆ దృశ్యం చూసి అవ్యక్త మధురమైన ధ్వనులతో చిలుకల సమూహములు మిమ్మలిని అర్థయుక్తంగా పలకరిస్తూ నవ్వుతున్నాయి.

ఎక్కడి కేగి వచ్చితి రమేశ్వర నీతను దివ్యగంధ మే

చక్కనియింతిమేనిదని సారెకు నీయలమేలుమంగ నీ

**చెక్కు గళంబు గోళ్ళ వడి జేర్చుచు నీయలపార్చి వేడుటల్**

**మక్కువగల్లుకాంతలకు మర్మరహస్యము వేంకటేశ్వరా ! 43**

**తాత్పర్యం:**

**లక్ష్మీ పతీ ! ఎక్కడికి వెళ్లి వచ్చావు స్వామీ ! నీ శరీరంపైన అద్భుతమైన వాసన ఏ చక్కని స్త్రీ రాసుకొన్న కస్తూరి తండ్రీ ! " అంటూ నీ భార్య అలమేలుమంగ మాటిమాటికి నీ బుగ్గలపై , గొంతుపై గోటి గుర్తులను చేస్తోంది. నువ్వు పడి వచ్చిన శ్రమను పోగొడుతోంది. వేడుకొంటోంది. ఇది అంతా ప్రేమ కలిగిన కాంతల కిటుకు. రహస్యము. అవును కదా ! వేంకటేశ్వరా !**

**విశేషాలు**

1. **కస్తూరి2. చందనము3. కర్పూరము 4. అగరు 5. మలయాగరు చందనము అని గంధాలు అయిదు విధాలు.)**

**........... లను బబ్బిలికాయలు పైడి మట్టియల్**

**మోద మెలర్ప నందియలు మ్రోయగనయ్యలమేలుమంగ క**

**త్యాదరలీలబాడ బలువంచును వేదము........**

**....................................................... ను వేంకటేశ్వరా ! 44**

**తాత్పర్యం:**

**ప్రబ్బలి చెట్ల గురించి అద్భుతమైన వర్ణనలు రకరకాల గ్రంథాలలో ఇలా కనబడతాయి. నదుల పక్షాన గంగానది సముద్రుడితో 'మేము వేగంగా ప్రవహించేటప్పుడు కొండలు, చెట్లు అహంకారంతో మాకు అడ్డుగా నిలుస్తాయి. అందువల్ల మా బలాన్ని చూపించి వాటిని పడగొట్టేస్తాం. ప్రబలి, తుంగవంటి మొక్కలు మా రాకకు స్వాగతం చెబుతున్నట్లు వినయంతో తలవంచుతాయి. కనుక మేము వాటి మీదుగా ప్రవహించి నీ**

దగ్గరకు చేరుకుంటాం. తరవాత అవి తలలు ఎత్తి మునుపటిలా బతుకుతాయి. అంతే తప్ప వాటిమీద మాకు ప్రత్యేకంగా ప్రేమ ఏమీ లేదు' అని చెబుతుంది. (మహాభారతం)

శ్రీకృష్ణుడుయమునానదీ తీరంలోని ప్రబ్బలి చెట్ల పొదరింటిలో నిశ్శబ్దంగా, నిరాశగా కూర్చొని ఉన్నాడు (గీత గోవిందం- చతుర్థ సర్గము) ప్రబ్బలి చెట్ల వంటి సుకుమారములగు శరీరములు గల స్త్రీలలో చిగురువంటిదానా! (తిరుప్పావై) మన అన్నమాచార్యుడు ఈ ప్రబ్బలికాయలను ఎలా పోల్చాడో తెలుసుకొనే అవకాశం లేదు. ఈ పద్యం లో పదాలు చాలావరకు లేవు. అన్వయం కష్టం.

కాంచనరత్న నూత్న కటకంబులు సందులదండలు బ్రభల్

ముంచిన మేఖలావళులు మ్రోయగ నయ్యలమేలుమంగ నే

త్రాంచలగర్వవీక్షణసుహాసముతో నిను గోరి భ్రూలతన్

వంచిన దియ్యవిల్లు కడవంచు మరుండును వేంకటేశ్వరా 45

అర్థాలు

కటకంబు=కడియము; మేఖల= మొలనూలు, వడ్డాణము.

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ నీదగ్గరికి వయ్యారంగా నడిచివస్తోంది. తన బంగారు రత్నాలతో కలిసిన కొత్త కడియాలు , అక్కడక్కడ దండల కాంతులు ప్రకాశించే మొలనూలు గంటలు అందంగా మోగుతున్నాయి. తన కళ్ల చివర మెరిసే గర్వముతో కూడిన నవ్వుతో నిన్ను ఒక చూపు చూస్తూ కళ్లను అదోమాదిరిగా వంచింది. సరిగ్గా అదే సమయంలో మన్మధుడు కూడా తన చెరకు విల్లును కూడా వంచాడు.

ఒప్పగు తూగుటుయ్యలల నూగుచు నీవలమేలుమంగతో

నప్పుడు కౌగిట గ్రోతుల నాకటిపెల్లున నప్పళించున్

తెప్పలనవ్వుతో మనసుతిచ్ఛలతో నఱగన్ను లార్చున్

దెప్పలదేలు సౌఖ్య మిదె దేవరహస్యము వేంకటేశ్వరా ! 46

అర్థాలు

ఒప్పుగు= అందమగు తూగుటుయ్యలల ఉయ్యాలమంచముల: ఆకటిపెల్లున =ఆకటి ఆధిక్యముతో; అప్పళించు=యత్నించు,ఆస్ఫాలనముచేయు, చఱచు, తెప్పలనవ్వు = కనురెప్పలతో నవ్వు, తిచ్ఛ= నిశ్చేష్టత: అఱగన్ను = సగము మూయఁబడిన కన్ను ఆర్చు= ఆడించు; తెప్పలదేలు=మునుగు; దేవరహస్యము=దేవతలకు కూడా అంతుపట్టనిది

తాత్పర్యము :

వేంకటేశ్వరా ! నువ్వు మా అమ్మ అలమేలు మంగమ్మతో అందమైన ఉయ్యాల మంచాలలో ఊగుతూ , కౌగిళ్లలో రతిసౌఖ్యాలలో ఆకటి ఆధిక్యాలతో చరుస్తూ , కనురెప్పలతో నవ్వుకొంటూ , ఒక్కొక్క సారి మనసు ఆ పారవశ్యంలో స్తంభించిపోగా సగము మూయబడిన కన్ను రెప్పలాడిస్తూ ఆనందంలో మునిగిపోతుంటావు. ఈ సుఖము దేవతలకు కూడా అంతుపట్టనిది. నమో నమః.

గీసినగోళ్ళచే బసిడి కిన్నరకంపితముల్ కదల్చుచున్

రాసెడిగుబ్బచన్నులభరంబున నయ్యలమేలుమంగతో

మూసియు మూయ కక్షులరమోడ్చుచు జెప్పలదేలజేయగా

నాసల నీవు తన్మయము నందుట చిత్రము వేంకటేశ్వరా ! 47

అర్థాలు

కిన్నర= ఒకరకము వీణ.:కంపితము= వణకెత్తిన; అరమోడ్చు= సగముమూయు.

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగమ్మ తన బరువైన గుండ్రని స్తనాలను చేర్చి ఆబంగారు కిన్నర వీణ తీగలనుండి ధ్వనులను తన పొడుగాటి గోళ్లతో కదిలిస్తోంది.అ వీణా వాదనం వింటూ ఆవిడ పక్కన కూర్చున్న నువ్వు పారవశ్యంతో కన్నులు సగము మూసావు. ఆ అనందము కళ్లలో తేలగా ఏవేవో ఆశలతో నువ్వు తన్మయత్వము పొందుట చిత్రంగా ఉందయ్యా.

దొరలిన మేనిగందపొడిధూళి వసంతము ఘర్మవారిపై

జఱచినపువ్వు దేనెల వసంతము నీకలమేలుమంగకున్

నెఱసి కరంగు చిత్తముల నీళ్ళ వసంతము మీకు మీకు నీ

యొఱపులు నీప్రియంబులు మహోన్నతు లెట్టివొ వేంకటేశ్వరా ! 48

అర్థాలు

దొరలిన =దొర్లు,పడు:మేని- కాంతి గందపొడి కొన్ని గంధద్రవ్యములఁజేర్చి చేసిన పొడి, చూర్ణము. వసంతము = పసుపుసున్నమును కలిపిన యెఱ్ఱనీళ్ళు, ఘర్మవారి- చెమట, చఱచిన – అజచేతకొట్టు, పువ్వుదేనె -మకరందము నెఱసి- వ్యాపనము. ఒఱపులు-సౌందర్యములు 2 ఉపాయములు.

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మ నువ్వు కలిసి గంధం పొడి పసుపుసున్నము కలిపిన నీళ్లతో వసంతాలు ఆడుకొంటున్నారు.మధ్యే మధ్యే పానీయం లా. మకరందాలతో ఒకళ్లనొకళ్లను చరచుకొంటున్నారు. ఆ వసంతాలు కరగిన మీ మనస్సులో ఏమో . నాకు తెలియదు కాని వసంతాలతో తడుస్తూ వ్యాపించిన మీ సౌందర్యాలు, ప్రియాలు ఎటువంటివో చెప్పటానికి నా వల్ల కావటం లేదయ్యా.

చక్కని తల్లికిన్ నవరసంబుల వెల్లికి బుష్పవల్లికిం

జక్కనిమోవిముత్తియపుజల్లికి శ్రీయలమేలుమంగకున్

జెక్కులు మించుటద్దములు చేతులు క్రొత్త మెఱుంగుదీగ లా

క్రిక్కిరి గుబ్బలే పసిడికిన్నరకాయలు వేంకటేశ్వరా ! 49

అర్థాలు

వెల్లి - ప్రవాహము:వల్లి- తీగ, జల్లి-వల: క్రిక్కిరి -ఎడములేక వ్యాపించు. పసిడికిన్నర - ఒకరకము వీణ

తాత్పర్యం:

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగమ్మ చక్కని తల్లి. 1. శృంగారము, 2. హాస్యము, 3. కరుణము, 4. రౌద్రము, 5. వీరము, 6. భయానకము, 7. బీభత్సము, 8. అద్భుతము 9. శాంతము అను తొమ్మిది రసముల ప్రవాహము. చక్కని పెదవి అనే ముత్యాల వల. అటువంటి మా అలమేలు మంగమ్మ చెక్కిళ్లు ప్రకాశించే అద్దాలు. చేతులు కొత్తవైన మెరుపు తీగలు. ఎడములేకుండా వ్యాపించిన స్తనములు బంగారు కిన్నర వీణ యొక్క కాయలు.

అరిసెలు నూనె బూరియలు నౌగులు జక్కెరమండిగల్ వడల్,

బురుడలు పాలమండిగ లపూపములు య్యలమేలుమంగ నీ

కరుదుగ విందువెట్టు పరమాన్న చయంబులు సూపకోటియున్

నిరతి వినిర్మలాన్నములు నేతులసోనలు వేంకటేశ్వరా ! 50

తాత్పర్యం:

వేంకటేశ్వరా! మా అమ్మ అలమేలు మంగమ్మ నీకు అరిసెలు, సెనగపిండితో చేసిన పిండి వంటలు, పంచదార కలిసిన గోధుమపూరీలు, వడలు , వెన్న పాలకాయలు ,పాలు కలిసిన గోధుమపూరీలు, పరమాన్నములు, ముద్దపప్పులు , నేతుల వర్షాలు స్వచ్ఛమైన అన్నపు రాశితో కలిపి అపురూపంగా మిక్కిలి ఆసక్తితో విందు భోజనం వడ్డిస్తుంటుంది.

అన్నమయ్య వేంకటేశ్వర శతకం 51-100

కానిక లిచ్చె నీవిభుడు కౌగిటబాన్పున గమ్మవల్పుపూ

దేనెల ఘర్మబిందువుల దేహమునం దలమేలుమంగ నీ

వానగుమోముతో విభుని వంచు దలిర్చిన గాని తన్మయం

బైనను బాయ దంచు జెలు లందరు నీసతి వేంకటేశ్వరా ! 51

అర్థాలు

కానికలు- కానుక, వల్పు - వాసన ( అల్లసాని పెద్దన కూడా చెంగలువల వల్పు అన్నాడు.) తలిర్చి= సంతోషించి; తన్మయంబు = మైమరచిన స్థితి, పాయ దంచు -విడువదని

వివరణ —

వేంకటేశ్వరా! "ఓ అలమేలు మంగా ! నీ భర్త నీకు కౌగిలి అనే శయ్యలో మంచి బహుమతులు ఇచ్చాడు. ఆ బహుమతులు అందుకొన్న నీ శరీరంలో కమ్మటి వాసనలతో కూడుకొన్న చెమట బిందువులు వచ్చాయి. ఆ తర్వాత నువ్వు ఎంతసేపు ఆ వేంకటేశుని అలా నవ్వు మోముతో చూస్తుంటావే ! ఆ పరవశము, సంతోషము నిన్నెప్పుడు విడవదా ! "అని నీ భార్య అలమేలు మంగమ్మతో చెలికత్తెలు వేళాకోళాలు ఆడుతుంటారు.

పెనగకుమమ్మ! చిమ్ము జళిపించిన చూపుల గర్వరేఖ రా

జెనకకు మమ్మ! లేజెమటచెక్కుల నోయలమేలుమంగ నీ

ఘనుడు కళావినోది రతికాంత విలాససహస్రమూర్తి వ

ద్దని పొలయల్క దీర్తురు లతాంగులు నీసతి వేంకటేశ్వరా ! 52

అర్థాలు

పెనగు=1.చుట్టుకొను.2. మారాడు.3. యుద్ధము చేయు ;చిమ్ము=1.పొడచుట.2. మీటుట, జళిపించిన =కత్తిని ఆడించు,చెనకకు= 1. ఎదిరించు.2. తాకు. పొలయల్క=ప్రణయకోపము.

వివరణ

వేంకటేశ్వరా !"మీ ఆయన వేంకటేశునితో యుద్ధం చేయకు తల్లీ ! పొడిచేటట్లు, కత్తిని జళిపించినట్లున్నచూపులతో , లేత చెమటలు ఊరుతున్న చెక్కిళ్లతో వేంకటేశుని ఎదిరించకమ్మా ! నీ భర్త వేంకటేశుడు అనేక కళలు తెలిసిన వాడు. వాటిలో వినోదించేవాడు. మంచి అందగాడైన రతీదేవి భర్తయైన మన్మథునివంటి వేయి మంది ఒక్క సారి కలిసి వచ్చినా మీ ఆయన వేంకటేశుని సౌందర్యం ముందు దిగదుడుపే. కాబట్టి నీ భర్త మీద ప్రణయ కోపం వద్ద"ని చెలికత్తెలు నీ భార్య అలమేలుమంగను ఓదారుస్తుంటారు.'

కులుకకుమమ్మ చిమ్ముజిలుకుం గొనచూపుల బిత్తరంబుగా

నులుచకుమమ్మ బొమ్మముడి నూల్కొనగోపము లేతనవ్వుగా

సొలయకు మమ్మ కల్కి నునుసోగల నోయలమేలుమంగ నీ

చెలువున నంచు నెచ్చెలులు చేర్తురు నీసతి వేంకటేశ్వరా ! 53

అర్థాలు

బిత్తరంబుగా - చంచలముగా; శృంగార చేష్టగా, ఉలుచకు- ఊడబెఱకు, బొమ్మముడి - కోపముచే కలిగెడు కనుబొమల ముడి, భృకుటి, మాలుకొను - నిలుచు, అంగీకరించు. సొలయకు- వైముఖ్యమునొందు;ననుసోగల - పొడుగైన సోగకన్నుల

వివరణ –

ఓ వేంకటేశ్వరా ! -శృంగార చేష్టలు కురియు చూపులతో కులుకులు చూపించకు తల్లీ ! కోపాన్ని లేత నవ్వుగా మలిచి , కనుబొమల ముడితో స్వామి పట్ల అంగీకారాన్ని తెలుపకు తల్లీ, పొడవైన సోగ కన్నులతో వైముఖ్యాన్ని చూపించకు తల్లీ ! "అని నీ చెలికత్తెలు అలమేలు మంగమ్మను నీదగ్గరికి చేరుస్తుంటారు.

చాగు బళా జగత్పతికి జాగు బళా జగదేకమాతకున్

చాగు బళా రమేశునకు జాగు బళా యలమేలుమంగకున్

జాగు బళా యటంచు గడుజక్కని కాంతను వీధివీథిమీ

రేగగ నిత్తు రారతు లనేకవిధంబుల వేంకటేశ్వరా 54

అర్థాలు,

చాగు - ప్రశంసార్థకము well done oncellent),

వివరణ

వేంకటేశ్వరా!మా అమ్మ అలమేలు మంగమ్మతో కలిసి నువ్వు వీధి వీధిలో ఊరేగుతుండగా "ప్రపంచమునకు స్వామి యైన మా స్వామికి చాగు బళా. ఈ జగానికి అంతటికి తల్లియైన మా తల్లికి చాగు బళా. లక్ష్మీ దేవి భర్తకు చాగు బళా. అలమేలు మంగమ్మకు చాగు బళా. - అని మీకు హారతులిస్తుంటారు.

విశేషాలు

1.చక్కని తల్లికి చాంగుబళా.. అను అన్నమయ్య కీర్తన ప్రసిద్ధము.

2బాలుడా గోపాలుడా లోకాలపాలుడా తెలిసేది ఎలా ఎలా చాంగు బాగా! అని ఒక సినీ గీతంలో సీతారామ శాస్త్రి గారు సందేహార్థకంలో ఈ చాంగు ఆ శబ్దాన్ని అందంగా ప్రయోగించారు. 3 మరాఠీ భాషలో చాంగా అంటే బాగు అనే అర్థం ఉంది. ఈ చాంగ్లా తెలుగులో చాంగు బళా గా మారిందేమో !

చొచ్చితి దల్లి నీ మఱుగు సొంపుగ నీకరుణాకటాక్ష మె

ట్టిచ్చెదొ నాకు నేడు పరమేశ్వరి ! యొయలమేలుమంగ నీ

మచ్చిక నంచు నీతరుణి మన్నన నేనినుగంటి నీకు నా

బచ్చెనమాట లేమిటికి బ్రాతిదె చూడగ వేంకటేశ్వరా ! 55

అర్థాలు

చొచ్చితి = అరంభించితిని

"సుదతికి మధుసేవఁ దనువు సక్కగజొచ్చెన్."ఇత్యాదులయందు చొచ్చెన్ అనఁగా ఆరంభించెనని యర్థము. (బహుజనపల్లి శబ్దరత్నాకరము); మఱుగు -చాటు: మచ్చిక =1. స్నేహము 2. మోహము .బచ్చెనమాటలు= మోసపు మాటలు: బ్రాతి-ప్రేమ.

తాత్పర్యము

ఈ పద్యంలో అలమేలుమంగమ్మ వేంకటేశ్వరునితో ఇంతకు పూర్వం అతడు మాట్లాడిన మాటలు గుర్తు చేసి , ప్రణయ కలహమాడుతోంది. "ఓ వేంకటేశ్వరా ! ఇదివరకు ఒకసారి ఏమన్నావ్ ! గుర్తు తెచ్చుకో ! పరమేశ్వరీ | తల్లీ ! నీ చాటుకు చేరటం ప్రారంభించాను. నీ దయతో కూడిన చూపులు నాపై కురిపించు.

అంతా నీపై స్నేహమే! నీ దయతోనే నిన్ను చూడగలిగాను "అంటూ ఇదివరలో చెప్పావు. ఎందుకయ్యా | మోసపు మాటలు. ఇప్పుడు ఎక్కడుందయ్యా ! ఆ ప్రేమ! "

యెచ్చరికమ్మ పాదములు నిందిర సింధురయాన తమ్మిపూ

నెచ్చెలి క్రొత్తక్రొత్తపలునిగ్గులతో నలమేలుమంగ నీ

వచ్చిన దాక నీవిభుడు వంచిన మోమును నెత్తడంచు నీ

మచ్చిక యింతి నింతులు మమత్త్వము నెంతురు వేంకటేశ్వరా ! 56

అర్థాలు

ఎచ్చరిక= సూచన.ఇందిర = లక్ష్మి.సింధురయాన=ఏనుగు వంటి నడక కలిగినది. తమ్మిపూనెచ్చెలి= పద్మానికి స్నేహితురాలు,పలు= అనేక, నిగ్గు= కాంతి, మచ్చిక =ఆసక్తి, మోహము, మమత్త్వము=అభిమానము

తాత్పర్యము

వేంకటేశ్వరా ! నీ కోసం గబగబా పరిగెత్తుకొస్తున్న మా అమ్మ అలమేలుమంగమ్మను స్నేహితురాళ్లు ఇలా ఆట పట్టిస్తుంటారు.

"ఓ అలమేలు మంగా ! ఏనుగువంటి నడక కలదానా !పద్మమువంటి సుకుమారత్వము కలదానా ! నీ పాదాలు జాగ్రత్త. నువ్వు అంత కంగారుతో గబగబా నడవనక్కరలేదు. నువ్వు వచ్చేదాకా ఆ వేంకటేశ్వరుడు వంచిన తల పైకెత్తడు. ఇంకొకరిని చూడడు. నీపై ఉన్న మోహము అలాంటిదే !"(ఇలా చెలికత్తెలు నీకు మా అమ్మపై ఉన్న ఆసక్తిని చెబుతుంటారు. )

కనకపుబీరి నెక్కి రతికాంతశరాకృతి నీవు వీధులం

జనునెడ నీదు చెంగట బ్రసన్నతతో నలమేలుమంగ కాం

చననవకింకిణీరవము సన్నపుదాళగతిన్ రచింపగా

గనుగవ మోడ్చి మోడ్చి రతిగౌగిట జేర్తువు వేంకటేశ్వరా ! 57

అర్థాలు

కనకపుబీరి= బంగారపు ఆసనము;రతికాంతశరాకృతి= మన్మథుని బాణము వలె చనునెడ= నడవగా ;చెంగట =సమీపము కాంచననవకింకిణీరవము=కొత్త బంగారపు అందెల రవము, తాళము= పాడునపుడు చేతులతో చఱచెడి చఱపు; కనుగవ= కన్నుల జంట మోడ్చి =ముకుళించిTo close (as the eyes or a flower,)

తాత్పర్యము

వేంకటేశ్వరా ! నువ్వు కనకపు సింహాసనము మీద కూర్చొని మన్మథుని బాణంలా మెరిసిపోతూ వీథుల్లో తిరుగుతున్నావు. ఆ సమయంలో నీ పక్కనే ఉన్న మా అమ్మ అలమేలు మంగమ్మ స్వచ్ఛమైన మోముతో అందంగా కన్నులు ఆర్పుతూ మనోహరంగా తన కొత్త బంగారపు అందెల రవళిని సన్నగా చేసింది. నువ్వు ప్రేమావేశంతో ఆసక్తితో ఆమెను కౌగిటిలో చేర్చావు.

ఒఱపగుమీ విహారతతు లుప్పనబట్టెలు బిల్లటీపుల

చ్చెరువుగ బల్లకోటులు ప్రసిద్ధి గ నయ్యలమేలుమంగకున్

మెఱుపులు ముచ్చటల్ రతుల మ్రొక్కులు దక్కులు వచ్చి వచ్చిమీ,

చిఱునగవుం బ్ర మోదములు చెక్కులనొక్కులు వేంకటేశ్వరా ! 58

అర్థాలు

ఒఱపగు=విలాస వంతమయిన తతులు సమూహములు, ఉప్పనబట్టెలు=బాలక్రీడా విశేషము. (పడతి నీచూపు లుప్పనఁబట్టె లాడించి చెలుల వక్త్రములు బూజింతుఁగాక."ఉత్తర హరివంశము.) బిల్లటీపులు =బాలక్రీడావిశేషము, అచ్చెరువు= ఆశ్చర్యము, బల్లకోటులు =బాలక్రీడావిశేషము;మ్రొక్కులు = నమస్కారములు, తక్కులు= తప్పులు

తాత్పర్యము

వేంకటేశ్వరా ! నువ్వు , మా అలమేలు మంగమ్మ ఇంత పెద్దవారయినా ఆశ్చర్యంగా చిన్నప్పటి ఉప్పనబటేలు, బిల్లటీపులు, బల్లకోటులు అను బాల బాలికల క్రీడలను ఆడుకొన్నారయ్యా ! ఆ ఆటలు ఆడుకొంటూ మీ రతులలో క్రమక్రమంగా మాటల మెరుపులతో కూడిన ముచ్చటలు, నమస్కారాలు, చిలిపితప్పులు , చిరునవ్వులు, సంతోషములు, చెక్కిళ్ల నొక్కుళ్లు - ఎన్నెన్ని చెప్పమంటావయ్యా ! స్వామీ !

చక్కెర బొమ్మ చెక్కులనె సానలు పట్టిన పువ్వుటమ్ములో

గ్రుక్కినజవ్వనంబు పెనుగుబ్బలు శ్రీయలమేలుమంగ నీ

వక్కున జేర్చి పట్ట సకలాధిప సౌఖ్యము నీకు నబ్బెగా

కెక్కువ లంటు కందువల యింపుల సొంపుల వేంకటేశ్వరా ! 59

అర్థాలు

సాన=గంధము తీసెడు ఱాయి, కందువ= కళాస్థానము

తాత్పర్యము

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగమ్మ చక్కెర బొమ్మ . ఆమె చెక్కులను సాన తీయగా వచ్చిన పువ్వులనే బాణాలు ఆమె యౌవన సంపదలు. వాటిని చేపట్టి ప్రేమతో నువ్వు సకలానికి అధిపతి అయ్యావు.

పరిమళముం బ్రభావము శుభస్థితి నిత్యవిభూతి విభ్రమ

స్ఫురణము దివ్యవైభవము భోగము శ్రీయలమేలుమంగ నీ

యురమున నంచు సన్మునులు యోగిజనంబులు మెచ్చి మెచ్చి నీ,

వరవనితా శిరోమణి నవారణ గొల్తురు వేంకటేశ్వరా ! 60

అర్థాలు

అవారణ= యథేచ్ఛగా

తాత్పర్యము

వేంకటేశ్వరా ! నీ వక్షస్థలములో ఉన్న మా అమ్మ అలమేలు మంగమ్మ నిత్య పరిమళ యుతమైనది. ప్రభావము కలది. ఎప్పుడు శుభమైన స్థితిలో ఉండేది. కొలిచేవారికి నిత్యము ఆశ్చర్య కరమైన ఐశ్వర్యము కలిగించేది. శ్రేష్ఠమైన వైభవములు కలిగినది. భోగములు కలిగినది అని యోగి జనులు, ముని శ్రేష్ఠులు నీ వనీతా రత్నమైన అలమేలు మంగను యధేచ్ఛగా కొలుస్తుంటారు.

విశేషాలు

ఎనిమిది భోగాలు ఏవి అన్న దానిమీద ఒక సమగ్రత లేదు. ఈ విధంగా నాలుగు వరుసలు ఉన్నాయి. 1. గంధము, 2. తాంబూలము, 3. పుష్పము, 4. భోజనము, 5. వస్త్రము, 6. సతి, 7. స్నానము, 8.సంయోగము,

1. గంధము, 2. తాంబూలము, 3. పుష్పము, 4. అన్నము, 5. వస్త్రము, 6. స్త్రీ. 7. శయ్య, 8, గానము.

1. గంధము, 2. తాంబూలము, 3. పుష్పము, 4. గృహము, 5. వస్త్రము, 6. స్త్రీ. 7. ఆభరణము, 8 శయ్య,

1. ధనము. 2 ధాన్యము. 3 వాహనము. 4. భోజనము. 5 వస్త్రము, 6. పతి. 7. స్నానము. 8.సంయోగము,

కులికెడుపండుటామనుల గోయిలకూతల గుండె ఝుల్లనన్

జెలువము గల్గు రాకలను జెంగట శ్రీయలమేలుమంగ కో

విలకలనాదకోటులచవిం బచరింపగనెట్టులోర్తువో

వలపులవారిలోన ననివారణ దేలుచు వేంకటేశ్వరా ! 61

అర్థాలు

కులికెడు=శృంగారముగా కదులు, పండుటామనుల = పండిన వసంత ఋతువులలో, చెలువము = అందము, మహత్వము, కోవిల= కోకిల, కలనాదము = అవ్యక్త మధురము: (ధ్వని.) చెంగట= దగ్గర, చవి= రుచి, పచరింపగా – ప్రసరించగా, అనివారణము = నిరోధము లేకుండా.

తాత్పర్యము

- వేంకటేశ్వరా ! అటు అందమైన వసంత ఋతువు. కోయిలమ్మ కూతలతో గుండె ఝుల్లు అంటున్నది. ఇటు అందమైన రాకలతో అలమేలుమంగమ్మ దగ్గరగా వచ్చి రకరకాల క్రీడలలో ఆ కోకిలమ్మ కంటే అవ్యక్త మధురమైన కూతలను చేసింది. మా అమ్మ వలపు సముద్రములో తేలుతూ ఆ ప్రేమ రుచుల ప్రసారాన్ని ఎలా ఓర్చుకొంటావో ఏమిటో !

తొలకెడుకొప్పులో నెరులో తుమ్మెదదాటులో చూపువంపులో

గులుకులో మించివెన్నెలల గుంపులో శ్రీయలమేలుమంగకున్,

బలుకులు పచ్చకప్పురపు బల్కులు తావులె దివ్యగంధముల్

పలుచనినవ్వులే విరుల పొన్నులు నీకును వేంకటేశ్వరా ! 62

అర్థాలు -

తొలకెడు = చలించు; నెరులో = The hair దాటు = గంతు, మించు = మెఱయు.

తాత్పర్యము –

ఓ వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగ చూపు వంపులా? కదిలే కొప్పులో ముంగురులా? నల్ల తుమ్మెదల గంతులా ?(అలమేలుమంగ చూపులు నల్లటి తుమ్మెదల్లా ఉన్నాయని భావము) మా అలమేలుమంగమ్మ విలాసాలా? మెరిసే వెన్నెలల గుంపులా ? (అలమేలుమంగ విలాసాలు మెరిసే వెన్నెలలా ఉన్నాయని భావము).మా అలమేలుమంగమ్మ మాటలు గుబాళించే పచ్చకర్పూరాలు. ఆమె శరీరమునుండి వచ్చు వాసనలు దివ్య గంధాలు. ఆమె పలుచగా నవ్వే నవ్వులు నీకు పూల పొన్నులు.

అందము చూతు రుప్పవడమై ఘనులాయలమేలుమంగమో

మందము గాగ జూతువు ప్రియంబున మెల్లననీవటుండబో

యందటిమోముటద్దములు నవ్వల నవ్వుల గోటికొండలై

యందములోన నందములునై వెలుగొందుచు వేంకటేశ్వరా ! 63

అర్థాలు-

ఉప్పవడము=మేలుకొనుట, అవబోధము

**తాత్పర్యము –**

**వేంకటేశ్వరా !గొప్పవారు ఇతరుల అందము మేలుకొనునట్లు చూస్తుంటారు. మహానుభావా ! నువ్వు అటువంటి వాడివే ! మా అలమేలు మంగ ముఖాన్ని ప్రేమతో అందమయ్యేటట్లు చూస్తావు.(ఇదివరకే మా అమ్మ మోము అందమైనది. నువ్వు చూడటం వల్ల ఇంకా అందం పెరిగిందని భావం). నువ్వు , మా అమ్మ అలమేలుమంగ పక్కకు చేరావు. పిమ్మట భక్తులమైన మా అందరి ముఖములనే అద్దాల్లో మీ ఇద్దరి నవ్వులు అందములోన అందాలుగా ప్రకాశిస్తూ కోటి కొండలుగా ప్రకాశించాయి.**

**తలచిన గుండె జల్లనును దల్లడమందెడు నేమిసేతు నా**

**చెలువుడు రాఁడటంచు లలసీనవి వో యలమేలుమంగ నీ**

**తొలకరిమించు నెమ్మనము తొయ్యలి జూడక యెట్టులోర్తువో**

**యలుగకు మన్న మానవికనైనను నెన్నడు వేంకటేశ్వరా! 64**

**భావం - ఓ వేంకటేశ్వరా! నిన్ను తలచిన మా అలమేలుమంగకు గుండె జల్లనును.ఇంకా నా స్నేహితుడైన వేంకటేశుడు రాలేదు.... ఏమి చేయాలి అని తత్తర పడుచున్నది. అలసిపోతున్నది. వర్షాకాలపు మెరుపును మించు అందమయిన మనస్సు కలిగిన మా అలమేలుమంగను చూడకుండా ఎలా ఓర్చుకొంటున్నావ్? అలుక చూపించకు. కోపము మానుకో ! మా అలమేలు మంగదగ్గరకు రావయ్యా !**

**ఆయలమేలుమంగ కమలాననయుం గలుహారనేత్రియున్**

**బాయక తానయై చెలగుబద్మ హితాక్షముజంద్ర నేత్రమున్**

సోయగలీలమించు నెటుచూచినబొందిక నెద్ది నిద్ర నీ

కేయడ మేల్కొనంగదటి యెయ్యది చూడగ వేంకటేశ్వరా ! 65

అర్థాలు -

కలుహారనేత్రి=కలువలవంటి నేత్రములు కలది;పాయక =Constantly.2. without intermission;అక్షము=కన్ను, పొందిక = 1.పొంకము;(మాట పొందికగా లేదు.)2. చేరిక; తటి = సమయము.

తాత్పర్యము

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మ కమలమువంటి మోము కలది. కలువలవంటి నేత్రములు కలది.నీకేమో ఒక కన్ను సూర్యుడు. ఒక కన్ను చంద్రుడు. సూర్యుడిని చూసి కమలం వికసిస్తుంది. కలువ ముడుచుకొంటుంది. చంద్రుడిని చూసి కమలం ముడుచుకొంటుంది. కలువ వికసిస్తుంది. అందువల్ల మా అమ్మ, నువ్వు కాసేపయినా నిద్ర పోవటానికి సమయము కనబడటం లేదు. మహా చిక్కు ఏర్పడిందయ్యా !

నెఱి నలమేలుమంగకును నీకును పద్మభవాండభాండమే

మెఱసిన బొమ్మరిల్లు తగుమేడలు మీదటిలోకముల్ ప్రభల్,

తెఱలగ మించు నయ్యనుడె దీపము గుజ్జనగూడు చంద్రుడే

తొఱలిన దేవసంఘములె తొత్తులు బంట్లును వేంకటేశ్వరా ! 66

అర్థాలు -

నెఱిన్ = అందముగా, పద్మభవ =బ్రహ్మ.(వ్యు. పద్మము నందు పుట్టినవాఁడు), తెఱలగ = బయలువెడలు. ఇనుడె = సూర్యుఁడు, గుజ్జనగూడు = బాలబాలికలు ఆడుకొనే ఆట (కోస్తా; కళింగాంధ్రం] తొఱలిన= ప్రవహించు; తొత్తులు = బానిసలు, బంట్లు = సేవకులు

తాత్పర్యము

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మకు, నీకు ఈ బ్రహ్మాండము (=ప్రపంచము) ఒక మెరిసే బొమ్మరిల్లు వంటిది. ఈ ప్రపంచమునకు మీద ఉన్న లోకములు మీ ఆటలో మేడలు. కాంతులు బయలువెడలిన సూర్యుడు మీ ఇంటి దీపము. చంద్రుడు మీరు ఆడుకొనే ఆటలో ఉపయోగించే వస్తువు. దేవతా సమూహాలు మీకు బానిసలు. సేవకులు.

వడి నలమేలుమంగ నిడువాలికచూపునివాళి నీపయిన్

సుడిసిన తమ్మిరేకులబ్రసూనశరంబులు గల్వరేకులన్

బడిబడి మీదమీద రసభావనగా దిగబోసినట్ల పో

పొడవగు పువ్వుజొంపముల పూజలు నీకును వేంకటేశ్వరా ! 67

అర్థాలు –

వడి = వేగముగా,నిడువాలికచూపు= పొడవయిన, వాడియైన చూపునివాళి = హారతి, సుడిసిన = తిరిగిన, తమ్మిరేకుల= పద్మపు రేకులు, బడిబడి=మాటిమాటికి, దిగబోసినట్ల = కిందికి వ్యాపించినట్లు

తాత్పర్యము –

ఓ వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగమ్మ తన పొడవైన చూపులను హారతిగా నీవైపు తిప్పింది. ఆ చూపులు పద్మపు  రేకులు.పూల బాణాలు.  ఆమె కన్నులనే కలువ రేకులనుండి వస్తున్న చూపులు నీకు చేసే పూల గుబురుల పూజలు.

నిను నలమేలుమంగ ఘననీరజపంక్తులు దాక నేసినన్

జనుగవ నొత్తినట్లు కెరజంబుల వాండ్లును నొత్తినట్లు ని

గ్గున గనుదోయి తామరల గొంకక సారెకు నొత్తినట్లు మై

జెనకి మరుండు బాణములు చిమ్మినయట్లగు వేంకటేశ్వరా!  68

తాత్పర్యము

వేంకటేశ్వరా! నీతో ఆటలాడుకొంటూ మా అలమేలుమంగ నిన్ను గొప్పవైన తామర పూలు నీ శరీరముపై తగిలేటట్లుగా వేసింది. నిన్ను తామరపూలు తాకితే - మా అలమేలు మంగ- వక్ష స్థలాన్ని   ఒత్తినట్లుగా, కులుకుతనాలలో వాడి తనాలు ఒత్తినట్లు, కనుల తామరలను ఒత్తినట్లుగా ,   శరీరముపై   మన్మథుడు బాణములు వేసినట్లుగా- అనుభూతి పొందుచున్నావు.

అపు డలమేలుమంగ పొలయల్కలు వద్దని చాటి చెప్పినన్

గపటపుటల్క లల్లితివి గర్వితనంబున గొంత కోరమే

రపమునజాతుగా కలుక రాజసలీలల నింత దీఋనా

విపులవియోగతాపమున వేడుకకూటమి వేంకటేశ్వరా ! 69

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! అప్పటికీ ఒకసారి మా అమ్మ చెప్పింది. “ప్రణయ కోపాలు చూపించవద్దయ్యా స్వామి !"అని. నువ్వు వినలేదు. నీ గర్వముతో - ఆ- ఈవిడేం చేస్తుందిలే - అని- కపటపు అలుక చూపించావు. ఇంకేముంది. కొంప మునిగింది. ఇప్పుడు మా అమ్మకి నీ కపటపు అలుక వల్ల నిజంగానే హద్దులు లేని కోపం వచ్చింది. నువ్వు ఎన్ని ఓదార్పు మాటలు చెప్పినా , ఆవిడని ప్రసన్నం చేసుకోవటం కష్టం. మీ వియోగం ఎప్పుడు తీరుతుందో ! సంతోషపు కూటమి ఎప్పుడు కలుగుతుందో ! చెప్పటం కష్టం .

ఇలనలమేలుమంగ నిను నేమని తిట్టునొ యేకతంబునన్

గలికి మెఱుంగుడాలు తెలికన్నుల జంకెన నద్దలింపుచున్

బలుకులముద్దు లింపొలయ భారపు గుబ్బల దూర నెత్తుచున్

జలజల కొప్పుసంపెగలు జాజులు రాలగ వేంకటేశ్వరా ! 70

అర్థాలు -

ఇలన్= ఇక్కడ; ఏకతంబున= ఆలోచనకు దగినచోటు, రహస్య ప్రదేశము;కలికి= మనోజ్ఞము; మెఱుంగుడాలు=కాంతి కలిగిన అందమయిన; తెలికన్నుల = నిర్మలమయిన; జంకెన=బెదరింపు; అద్దలింపుచు= అదలించుచు

తాత్పర్యము

వేంకటేశ్వరా ! ఏకాంతములో మీ ఇద్దరు ఉన్నప్పుడు మా అమ్మ అలమేలుమంగమ్మ కొప్పు నుంచి సంపెంగలు, జాజులు రాలి పోతుండగా , ముద్దు మాటలలోనే , ప్రేమతో నిన్ను ఏమని తిడుతుందో !

చేతిని పైకెత్తి నిన్ను బెదిరించే సమయంలో పైట జారిపోయి బరువైన రెండు గుబ్బల మధ్య చిక్కుకుంటుండగా,దానిని మళ్ళీ సరిగా ఎత్తి చక్కదిద్దుకొంటూ ఏకాంతంలో నీకు ఏ తిట్ల బహుమానాలు మా అమ్మ ఇస్తుందో !ఆ ముద్దుల తిట్ల వర్షము కురిసే టప్పుడు మా అమ్మ అందమైన, నిర్మలమయిన కన్నులలో నీకు ఉత్తుత్తి బెదిరింపులతో నిన్ను ఎంత బాగా అదిలిస్తుందో ! .

తగునలమేలుమంగకును దన్మయమందెడునీకు మేనిలో

బగటులు బచ్చిమాటలను బచ్చెనయెచ్చరికల్ వివేకముల్

మొగముల లేతనవ్వులును మోవులనాటులుతమ్మితూటులున్

జగడపుబొందులున్ రతులసంపదవిందులు వేంకటేశ్వరా ! 71

అర్థాలు –

తన్మయము= తత్స్వరూపమైన, మైమరపు, పగటులు=ప్రకాశములు 2. లావణ్యములు . పచ్చిమాటలు= బూతు మాటలు, బచ్చెన యెచ్చరికల్ = పై పై హెచ్చరికలు (ఉత్తుత్తి హెచ్చరికలు) తమ్మితూటులు=పద్మాల రంధ్రాలు

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలు మంగమ్మకు, నీకు బాగా సరిపోయిందయ్యా ! తన్మయత్వాలలోను, కాంతులలోను, , ఉత్తుత్తి హెచ్చరికలలోను, మొగాలలో లేత నవ్వులు చిలకరించటంలోను, పెదవుల విందులలోను, రతుల సంపదలలోను. ఒకరికొకరు తగ్గరు. మా మంచి జోడీ స్వామీ !

సరి నలమేలుమంగకును జక్కనిమీకును మీకు మీకు లో

నరుదుగ నేకతస్ఫురణ నమ్ముడు వోయితి రొక్కరొక్కరు

న్నిరువురు నింక నేటి తెలి వెక్కడినేరుపు లేటిసైరణల్

గిరపులపుచ్చె మేన బులకింతలు వింతలు వేంకటేశ్వరా ! 72

అర్థాలు –

సరి=సమము; యుక్తము, ఏకతస్ఫురణ = ఒకటే స్థితి. అమ్ముడుపోయితి =వశమగు ఆంధ్ర శబ్దరత్నాకరము (చెలమచెర్ల రంగాచార్యులు) సైరణ =సహనము, ఓర్పు, గిరపు

ముక్రియాస్వరూప మణి దీపిక (విశ్వనాథ, ఆం.ప్ర.సా.అ.)

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మకు , చక్కనివాడైన నీకు సమానంగా జోడీ కుదిరింది. ఒకటే స్థితి అను భావముతో ఇద్దరూ ఒకరికొకరు వశమయ్యారు. వశమయిన తరువాత ఇక తెలివి , సహనములు ఎక్కడ ఉంటాయి.?! ఇద్దరి శరీరాలలో పులకింతలు వింతలు గొలిపేటట్లు సైగలు చేస్తున్నాయి.

ఒకయలమేలుమంగ మహిమోన్నతి జిక్కితి యోగలీలచే

జికురభరంబు జాఱ నలసె నన్ని ఖిలోన్నతు డంచు నీ కృప

బ్రకటములైన కాం ............యింతురు శీతల క్రియన్

మొకముల నిగ్గు దేఱగను ముచ్చటలాడుచు వేంకటేశ్వరా ! 73

(ఈ పద్యంలో మూడవ పాదంలో కొంత భాగము రేకులలో లేదు. అందువల్ల పద్యంలో అన్వయము కొంత కష్టం గానే ఉన్నప్పటికి అన్నమయ్య వేంకటేశుని దయతో వివరించటానికి ప్రయత్నిస్తాను. )

అర్థాలు –

యోగలీల= సంపదను సమకూర్చుకోవడం యోగం, దానిని భద్రం చేసుకోవడం క్షేమం.(యోగ క్షేమాలు) ఈ లీల యోగలీల; చికురధరంబు = కేశ సంపద

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మ చెలికత్తెలు ఇలా ముచ్చటలాడుకొంటుంటారు. "ఈ వేంకటేశుడు ఒక అలమేలు మంగ ఉన్నతమైన ప్రేమ మహిమలో చిక్కుకొన్నాడు. ఇదంతా యోగ లీల. పాపం.. అన్నిటా గొప్పవాడయిన ఆవేంకటేశుడు అలమేలుమంగతో కలిసి ఉన్నప్పుడు తన కేశ సంపద జారిపోతుండగా అలిసిపోయాడు. మా వేంకటేశుని చల్లనిదయ (ఏ రకమైన దయో ?!) ప్రసరించిన తరువాత అలమేలుమంగమ్మ మొగంలో కాంతి బాగా నిగ్గు తేరింది."

నగ వలమేలుమంగకును నాటవవల్కులు నీకు మాటలన్

బగ దలమేలుమంగకును బచ్చెనగర్వము నీకుజూపులన్

జిగి యలమేలుమంగకును శ్రీమల వేడుక నీకు నిట్ల పో

మిగిలిన మోహసంపదలు మీరును మీరును వేంకటేశ్వరా! 74

తాత్పర్యము

వేంకటేశ్వరా! ఆ అలమేలుమంగకు నవ్వులు. నీకు మాటలలో ఆటా పాటలు. ఆ అలమేలుమంగకు అలసట. (?) నీకు చూపులలో గర్వపు పూత. ఆ అలమేలుమంగకు ప్రకాశము . నీకు తిరుమల వేడుక . మిగిలిన మోహసంపదల విషయంలో మీ ఇద్దరికి ఇలాగే కదా ! అయినా అన్ని విషయాల్లో మీరు మీరు ఒకటే ..మాకెందుకులే.

ఈయలమేలుమంగ మణిహేమకటీరశనాకలాపముల్

రాయగ రాలు బైడిపొడి రంతులు మీటిన వజ్రపుంబొడి

శ్రీయలరారుకొప్పున బ్రసిద్ధిగ రాలెడు కమ్మపుప్పొడి

నీయనుగుంగవుంగిటికి నిచ్చె వసంతము వేంకటేశ్వరా ! 75

అర్థాలు-

అలమేలుమంగ = తిరుపతి సమీపమునగల తిరుచానూరు అను క్షేత్రమున వెలసియున్న మహాలక్ష్మి . శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవేరి పద్మావతి అమ్మవారు.వ్యు. అలరు + మేలు + మంగ. పుష్పవల్లి తాయారు.

మణిహేమకటీరశనాకలాపముల్ = శ్రేష్ఠమైన ముత్యము, బంగారముతో కూడిన పదియారు పేటలుగల మొలనూలు సమూహములు; పైడిపొడి= బంగారపు పొడి, రంతులు= కలకలధ్వనులు : కమ్మ= 1.మధురము;2.కర్ణభూషణము; పుప్పొడి=పూ+పొడి: పుష్పములందలి ధూళి; అనుగు= ప్రియమైన, వసంతము= పసుపుసున్నమును కలిపిన యెఱ్ఱనీళ్ళు, ఆనందము

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మ మొలనూలునుండి కలకల ధ్వనులతో రాలిపడు బంగారపు పొడులు, మధురమైన పుప్పొడి మీ ప్రియమైన కౌగిలికి ఆనందాన్ని ఇస్తుంటాయి.

ఓయలమేలుమంగ యిది యొక్కటి పో జగదేక భర్తకున్

బాయని నీకునుం గడమ ప్రాణము ప్రాణము నేకమాయె నీ

కాయము కాయముం గలిసె గౌగిటకాంక్ష యటంచు నీసతి

బ్రాయము నిండుజవ్వనము బల్మఱు మెత్తురు వేంకటేశ్వరా! 76

అర్థాలు –

జగదేక భర్తకు = ప్రపంచమునకు ఒకే ఒక ఈశ్వరుడైన వేంకటేశ్వరునకు, పాయని - ఎల్లప్పుడు విడువని

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! నీ భార్య అలమేలు మంగమ్మను అనేకమంది ఇలా మెచ్చుకొంటుంటారు. మీరిద్దరూ వేరు వేరుగా కనబడుతున్నారు కాని , ఎల్లప్పుడూ నిన్ను విడువని నీ భర్త , నువ్వు ఒక్కటే. నీ చివరి ప్రాణము (సమానము) , నీ భర్త ప్రాణము ఒకటే అయింది. నీ శరీరము, ఆమె శరీరము ఒకటిగా కౌగిళ్ల కాంక్షలో కలిసి పోయాయి. అంటూ నీ సతి అలమేలుమంగమ్మ వయస్సును, నిండు యావనమును అభిమాన చెలికత్తెలు అనేక సార్లు మెచ్చుకొంటుంటారు.

విశేషాలు -

కడమ ప్రాణము "మనలో ఉండే ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అను పంచవాయువులు బ్రహ్మ నుంచి ఉద్భవించాయి. అవి తిరిగి బ్రహ్మలోనే కలిసి పోతాయి. . ప్రాణముకు అపానముకు మధ్య ఉదానవాయువు

తిరుగుతుంటుంది. మానవుడు ప్రాణ అపాన వాయువుల వద్ద నిద్ర పోతున్నప్పుడు వ్యాన, సమాన వాయువులు వాటిలో కలసిపోతాయి. మానవుడు ఉదాన వాయువులో నిద్రించునప్పుడు మాత్రము ప్రాణ, అపాన వాయువులు విడిచిపెట్టవు అని  భారతము అశ్వమేధ పర్వము ద్వితీయాశ్వాసము లో ఉన్నది. అన్నమయ్య ఈ పద్యములో ఉద్దేశించిన కడమ ప్రాణము సమానము , అది నిద్ర సమయములో ప్రాణములో (పంచ ప్రాణములలో ఒకటి) కలిసి పోతుంది. ఈ తత్వ రహస్యము ను గదమ ప్రాణము ప్రాణము నేకమాయె అని అన్నమయ్య వివరించాడు. ,

ఇతడలమేలుమంగ విభుడీతడెవో కలశాబ్ధికన్యకున్

సతతము జిత్తమిచ్చిన రసజ్ఞుడు ప్రాజ్ఞుడు సర్వవైభవో

న్నతుడు రమాసతీ ప్రియుడు నందకశార్ఙ్గధరుండటంచు ని

న్నతివలు మెచ్చి మెచ్చి కొనియాడుదు రెప్పుడు వేంకటేశ్వరా ! 77

అర్థాలు –

కలశాబ్ధి=పాలసముద్రము.; రసజ్ఞుడు=రసికుడు; ప్రాజ్ఞుడు=1.సమర్థుడు.2.పండితుడు; నందక=విష్ణుని ఖడ్గము ;శార్ఙ్గము=విష్ణువుయొక్క విల్లు;

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! నిన్ను ఎప్పుడూ స్త్రీలు "ఇతడే అలమేలుమంగ భర్త. పాలసముద్రములో పుట్టిన లక్ష్మీదేవికి ఎప్పుడూ మనస్సు ఇచ్చిన (అనగా ఎప్పుడూ ఆమె మనస్సులో ఉన్న)రసికుడు (రుచి నెరిగినవాడు కళాసౌందర్యవేత్త) పండితుడు అన్ని వైభవములతో గొప్పవాడు. లక్ష్మీదేవి ప్రియుడు. నందకమను ఖడ్గము,

శార్ఙ్గము అను విల్లు ఎప్పుడూ ధరించువాడు "అని పదే పదే మెచ్చుకొంటూ పొగుడుతుంటారు.

విశేషాలు –

నందకము - 1.అరిషడ్వర్గము తెగనరికే హరిఖడ్గమ్మిది నందకము- వేటూరి. 2.అన్నమాచార్యుల వారు నందకాంశ సంభూతులని ప్రసిద్ధి.

3. 'శ్రీ శార్ఙ్గ నందక కౌస్తుభ ధారిణం వందే||" (ముత్తుస్వామి దీక్షితార్ కృతి).స్వామివారిని శార్ఙ్గ నందక కౌస్తుభ ధారిగా కొలిస్తేనే చాలామంది కవులకు తృప్తి. –

మాయలమేలుమంగ చలమా యలయించెద వెంతసేసినa\న్

దోయజగంధి నీకు మతితోడనె తక్కిన దల్క నోపు నా

చేయఁగ నేర్చుచేఁత లివె చేయుదుగాక లతాంతసాయకుం

డీయెడఁ జేయు వేదన లకిన్నియు దోడుగ వేంకటేశ్వరా!78

అర్థాలు -

అలమేలుమంగ = తిరుపతి సమీపమునగల తిరుచానూరు అను క్షేత్రమున వెలసియున్న మహాలక్ష్మి - శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవేరి పద్మావతి అమ్మవారు.వ్యు. అలరు + మేలు + మంగ. పుష్పవల్లి తాయారు. చలము =మాత్సర్యము; అలయించు =శ్రమపెట్టు.;తోయజగంధి =పద్మమువంటి మనోహరమైన వాసన కలది ;లతాంతసాయకుడు= మన్మథుఁడు.(వ్యు. అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అను అయిదు పువ్వులు ఆయుధములుగా కలవాఁడు.); తొడుగు=కవచము(తోడుగు అని అన్నమయ్య స్వేచ్ఛా

ప్రయోగము)

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! మా అలమేలుమంగమ్మ పై నీకు మాత్సర్యముందా ? ( ప్రణయపుటీసు)! ఎందుకయ్యా ! ఎంత చేసినా మా అమ్మను సమయానికి రాకుండా శ్రమ పెడతావు? పద్మములాంటి సుగంధము కలిగిన మా అమ్మ ఆలోచనలోకి వస్తేనే నీకు అలసట అంతా తీరుతుందే ! అటువంటిది ఆమెను ఎందుకయ్యా ! అంత అలసట పెడుతున్నావు? అసలే ఆ మన్మథుడు నీమీద విరహంతో ఉన్న మా అమ్మను బాధ పెడుతుతుంటే , ఆ బాధలకు కవచంలా నీ చేతలున్నాయి.

మతి నలమేలుమంగకును మంతనమాడెడునీవిలాసముల్

తతిఁ దలపోఁతలైసురతతాండవసంభ్రమలీలలైసమం

చిత సరసప్రసంగములు చిమ్మనిదొంతరలైప్రియంబులై

వితతమనోజవిద్యలనవీనములైనవివేంకటేశ్వరా!79

అర్థాలు మతి =తలపు ; మంతనమాడెడు=ఏకాంతమాడు. విలాసము=1.క్రీడ; స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము;తతి= సమూహము; తలపోతలై= ఆలోచనలై ;సురత=1.నైపుణ్యముగల;2. దయగల;తాండవ=ఈశ్వరుని నాట్యము; నాట్యము.;సమంచిత= గౌరవింపబడిన, పూజింపబడిన చిమ్మని=జలక్రీడలో నీరు చిమ్ము గొట్టము యొక్క;దొంతరలై=పరంపరలై, దొంతులై; వితత=వ్యాప్తి : మనోజవిద్యల=మన్మథ విద్యలలో ;

తాత్పర్యము - వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మ తమరు చేసిన కొంటె చేష్టలను, క్రీడలను

ఏకాంతములో తలచుకొంటోంది. తమరి విలాసాలు- మా అమ్మ ఆలోచనలలో - నిపుణత్వము కలిగిన నాట్య లీలలుగా , పూజింపబడిన రస ప్రసంగాలుగా, వేగంగా నీరు చిమ్ము గొట్టాలుగా, (ఆలోచనలు అంత వేగంగా ఉన్నాయని అర్థం) ,వ్యాప్తి చెందిన మన్మథ విద్యలుగా ఎప్పటి కప్పుడు కొత్త కొత్తగా మారుతున్నాయి స్వామీ!

కసిగలచూపు చిమ్ముదును కంకణహస్తము సాఁచి కుంచెచే

విసరకు రమ్మనంగ వడి వెన్నెలమోమున ముద్దుగుల్కెడి\న్

రసికున కంచుఁ జక్కనిపురంధ్రిని నీయలమేలుమంగతో

ముసిముసినవ్వు నవ్వుదురు ముచ్చటలాడుచు వేంకటేశ్వరా!80

అర్థాలు -

పురంధ్రి=కుటుంబముగల ఆడుది; కుంచె =చిత్రము వ్రాసెడు తూలిక;

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మ బొమ్మని ఏకాంతంలో తమరు కుంచెతో చిత్ర పటంపై గీస్తున్నారు. ఆ సమయంలో మా అమ్మ మీతో హాస్యంగా "కసిగల చూపు చూస్తూ ఈ కంకణము ఉన్న చేయి చాచి చూపించనా?బొమ్మ గీస్తారా !"అని అన్నది. మా అమ్మని కోపంగా గీయటం మీకు ఇష్టం లేక తమరు కుంచె విసరబోతుంటే అలమేలుమంగమ్మ వద్దని, ఇష్టం లేక పోతే చిత్రం గీయవద్దులే అని వారించింది.అప్పుడు రసికులైన మీ ముఖంలో ముద్దులు మూటలు గట్టాయి. ఎప్పుడో జరిగిన ఈ వృత్తాంతాన్ని చెలికత్తెలు మా అమ్మతో ముచ్చట్లలో గుర్తు చేసుకొని ముసిముసి నవ్వులు నవ్వుకొంటున్నారు.

నాడలమేలుమంగ జననంబుకునాకలశాబ్ధిద్రచ్చియా

మూఁడుజగంబులందును బ్రమోదము నించితి వట్ల నుండుచో

నాఁడుఁదనంపుబృంద ముదయంబును బొందఁగ నిత్యసంపదల్

నేఁ డిఁక నేమిటం గడమ నీకృప వారికి వేంకటేశ్వరా!81

అర్థాలు

కలశాబ్ధి=పాలసముద్రము. (కలశబ్ధిజ= the goddess Lakshmi). త్రచ్చి= చిలకటం;;నించితి= వ్యాపింపఁజేసితివి; ఆడుతనము=స్త్రీత్వము, స్త్రీధర్మము; బృందము=సమూహము;ఉదయము=పుట్టుక; కడమ=కొరత.

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగ (లక్ష్మి) పుట్టుక కోసం నాడు పాల సముద్రాన్ని దేవ రాక్షసులచే చిలికించి ఆనందాన్ని ఈ లోకంలో వ్యాపింపచేసావు.ఈ నాడు స్త్రీ సమూహాలు అనేకము పుట్టాయి. వారికి నిత్యమైన సంపదలు నీదయవలన కొరత లేకుండానే ఉంటాయి కదా ! (ఒక్క ఆడుదాని పుట్టుక కోసం పాల సముద్రాన్ని చిలకటం వంటి పెద్ద ప్రయత్నం చేసి నీదయ చూపించావు.. ఇంతమంది ఆడువారు పుట్టిన ఈ లోకంలో ఇక నీదయకు లోటు ఉంటుందా?అందరి ఆడువారిని లక్ష్మీ స్వరూపలుగా నువ్వు చేస్తావని భావము)

విశేషాలు –

సంపదలు దైవ సంపద, మానుష సంపద, ఆసుర సంపద అని మూడు విధాలు.

శాంతం, ధర్మ గుణాన్ని కలిగి ఉండటం, సంస్కారయుతంగా ప్రవర్తించడం, దైవ చింతన/ తత్త్వవిచారం చేయడం, గురువుల పట్ల, పెద్దల పట్ల వినయంతో మెలగడం, వారికి సేవ చేయడం దైవ సంపద.

లోకం దృష్టిలో తాను గొప్పవాడనని అనిపించు కోడానికి యజ్ఞయాగాదులు, దానధర్మాలు చేయడం, వేదాధ్యయనం చేసి, పురాణాలు చదివి, తాను పండితుడననీ, విషయజ్ఞుడననీ లోకం గుర్తించడం కోసం ఆరాటపడటం మానుష సంపద.నోటి మీద, చేతి మీద అదుపు లేకుండా ఆగ్రహావేశాలతో ప్రవర్తించడం, చుట్టూ ఉన్నవారు తనకు భయపడే విధంగా ప్రవర్తించడం, దొంగతనం, వ్యభిచారం లాంటి తప్పుడు పనులు చేయడం, మదమాత్సర్యాలు, ఓర్వలేనితనం, అతినిద్ర మొదలైన అవ లక్షణాలు కలిగి ఉండటం ఆసుర సంపద.

ఈతరుణీమణీ విభునియిచ్చకు జాలుతలంప నీయనా

ఈతని మోహినీగజము యీవని కాయలమేలుమంగ నే

డీతనువల్లి చక్కదనము.... .... .... చెలువంబు చాలదా,

యీ తెలిమించటంచు నుతియింతురు నీసతి వేంకటేశ్వరా ! 82

అర్థాలు

చాలు : 1. వంశానుగతమగు రీతి.2. పోలిక.3. సంప్రదాయము (శ్రీహరి నిఘంటువు తెలుగు-తెలుగు (రవ్వా శ్రీహరి),మోహినీగజము= పెద్ద మోహక శక్తి; మించు= ప్రకాశము;

తాత్పర్యము —

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగ కు నీ పై ఉన్న కోరికకు పోలికను చెప్పమంటావా ! నేను చెప్పటము దేనికి!? మా అమ్మ చెలికత్తెలు నీ కు పెద్ద మోహము కలిగించే శక్తి అలమేలు మంగ అని చెప్పుకొంటున్నారు. నీతో మా అమ్మ అలమేలుమంగ శారీరక లావణ్యము, నిర్మలమైన కాంతి చక్కగా జతకూడాయని, మీ ఇద్దరిని చెలికత్తెలు పొగుడుతుంటారు.

మణులవెలుంగు దీపవనమాలికలై పొగడొంద గంకణ

క్వణనము మేఖలావళులఘంటలు శ్రీయలమేలుమంగకు

బ్రణయవినోద సంపదకు బాయక నీ కొనరించుపూజకై

ప్రణుతనుత ప్రభావముల భాగ్యము లైనవి వేంకటేశ్వరా ! 83

అర్థాలు -

మణి- 1. పచ్చబాయి లోనగునది; (ఇది అశ్మ జాతి. 2. ముత్యము లోనగునది; (ఇది అనత్మజాతి.); వనమాల=మోకాళ్లవరకు వేళ్లాడుతూ, అన్ని ఋతువులలోనూ పూచే పూలతో, మధ్యన పెద్ద గుచ్చంతో విష్ణు మూర్తి మెడలో ఉండే దండ; పొగడొంద = ప్రసిద్ధి  ంద; కంకణ- కడియము. చేతినగ; క్వణనము - మ్రోత మేఖల ఆడుదాని యొక్క యెనిమిది పేటల మొలనూలు:ప్రణుత= మిక్కిలి పొగడబడిన; నుతజనుతింపఁబడిన

తాత్పర్యము –

వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగ , నువ్వు కలిసి ఉన్న సమయంలో ఆమె ధరించిన మణుల వెలుగు నీకు నిరంతరం ప్రకాశించే దీప సేవగా, వనమాలగా ప్రసిద్ధి చెందింది..(మణుల వెలుగు దీపమని, పొడుగైన

వనమాల అని భావం).మా అమ్మ చేతికివేసుకొన్న కంకణాల ధ్వనులు , నడుముకు పెట్టుకొన్న మొలనూలు ఘంటల ధ్వనులు - నీ పూజలో చేసే ఘంటానాదముగా పేరు పొందింది.ఈ రకంగా మా అమ్మ - మీ ప్రేమ వర్ధిల్లే సమయంలో చేసే పూజలు అందరి చేత పొగడబడుతూ , తలచుకొన్న వారికి భాగ్యాలైనాయి.

కదిసినసేసముత్తెముల కంఠసరుల్ ఘనరత్న కంకణాం

గదరశనా........... కాయము శ్రీయలమేలుమంగకున్

బొదివి వివాహ వేళ దిగబోసిన ముత్తెపుబ్రాలనందమై

ముదమగు నీకుగన్నుగవ ముందరనెప్పుడు వేంకటేశ్వరా! 84

అర్థాలు -

కదిసిన దగ్గరకు వచ్చు, అంటుకొనిన; కంఠసరులు = మెడను ధరించు నగలు, అంగదము= బాహుపురి: భుజశిరస్సు పై ధరించునట్టి భుజకీర్తి యను భూషణము. వ్యు. అంగ - దై (ఆ శోధనే) + క. (కృ.ప్ర) శరీరమును భూషించునది.నికాయము= గుంపు; పొదువు - క్రమ్ము, చుట్టుకొను;పాలు=బియ్యము:

తాత్పర్యము - వేంకటేశ్వరా ! మా అమ్మ అలమేలుమంగమ్మ కంఠ హారాలు, భుజ కీర్తులు, కంకణాలు పెట్టుకొని నీదగ్గరకు వచ్చింది. అమెను చూస్తూ పెండ్లినాటి ముత్యాల తలంబ్రాలు పోసే సమయంలో ఆమె అందాన్ని కళ్లముందుకు తెచ్చుకొని ఆనందిస్తున్నావు.

నిగిడి పయోధిద్రచ్చు నెడ నిర్జరసంఘము నిక్కి చూడగా

ధగధగ యంచు దిక్కుల నుదగ్రతటిల్లత లుల్లసిల్లగా

**దగ నుదయించి మించిన సుధాప్రతి మీయలమేలుమంగ నీ**

**మగువ యటంచు మెత్తురు సమస్తమునీంద్రులు వేంకటేశ్వరా ! 85**

**తాత్పర్యము –**

**వేంకటేశ్వరా ! ఆ పాలసముద్రము మథించు వేళలో దేవతల స మూహము నిక్కి చూస్తుండగా ధగధగ యంచు దిక్కులలో మెరుపులు ప్రకాశిస్తుండగా పుట్టిన అమృతముతో సమానమైన అలమేలు మంగను నీ భార్య అని అందరు మునులు  మెచ్చుకొంటారు.**

**నడవకుమమ్మ పాదనలినంబులు గందెడి, మాట బెట్టుగా**

**నొడువకుమమ్మ, చెక్కునను నొక్కులతో నలమేలు మంగ నీ**

**వెడనగ వీ మొగంబునకు వెన్నెలలాయె నటంచు నీసతిన్**

**బడతులు మేలమాడుదురు పల్కుల తేనెల వేంకటేశ్వరా! 86**

**అర్థాలు**

**పాదనలినంబులు= పాద పద్మములు; బెట్టుగా=గట్టిగా, దృఢముగా, నొడువకు= చెప్పకు; , వెడనగవు= కొంచెము పాటి నవ్వు: సతి= భార్య: పడతులు = స్త్రీలు; మేలమాడుదురు =పరిహాసము చేయుదురు ;**

**తాత్పర్యము**

**వేంకటేశ్వరా! "అలమేలుమంగా ! నడవకు. పాద పద్మాలు కందిపోతాయి. మాట గట్టిగా, అనకు.నీ బుగ్గలలో సొట్టలు భలే ఉన్నాయి. ఆ సొట్టలతో నువ్వు చిన్నగా నవ్వుతున్నప్పుడు నీ మొగానికి వెన్నెల తరలివచ్చింది."అని నీ భార్య అలమేలు మంగమ్మను చెలికత్తెలు ఎగతాళి చేస్తుంటారు.**

బూతలబండ్లనే వలపుఁబుక్కిట నించితి వాఁడిగోళ్లనే

ఘూతలు గాఁగఁ జించితివి కాయముపై నలమేలుమంగ నీ

చేతిదె యంచు నీతరుణి చెంతలఁ దట్టపునుంగుఁ గస్తురిన్

జాతుదు రోలి నీదు పరిచారిక కాంతలు వేంకటేశ్వరా! 87

అర్థాలు –

బూతలబండ్లు=పచ్చి బూతులు (అసహ్యమైన తిట్లు) పుక్కిట నించితి= ఆపోశన పట్టితివి(సర్వమును ఆకళించుకొన్నాడను పట్ల ఉపయోగించు పలుకుబడి) వాడిగోళ్లు= పదునైన గోళ్లు:ఘూతలు= గాయాలు ; నీ చేతిదె = నీచేతిలోనిదే (వశమైనదే) దట్టపునుంగు గస్తురి= కస్తూరి మృగములో కస్తూరి ఏర్పడు అరలో ఉండే కస్తూరి; చాతుదురు= సమర్పించెదరు;

అర్థాలు

ఓలి= వరుస, క్రమము

తాత్పర్యము

వేంకటేశ్వరా! ‘‘పచ్చి బూతులను మీ ప్రేమ కలాపాలలో ఆపోశన పట్టావు..పదునైన గోళ్లతో అలమేలుమంగ శరీరముపై ఒళ్లు చీరిపోయేటట్లు గాయాలు చేసావు. మా అమ్మ అలమేలు మంగ నీకు వశమైనది’’ అని పలుకుచూ సేవకురాళ్లు నీకు కస్తూరిని సమర్పిస్తుంటారు.

పచ్చల సందిదండలును బాహుపురుల్ మణినూపురంబులున్

మచ్చరికంబులుం బసిడిమట్టెల మ్రోతలు బెల్లు మ్రోయగా

నెచ్చలు లోని గొల్వ దరుణీమణి శ్రీయలమేలుమంగ నీ

ముచ్చట దీర్చు నొక్కపరి ముందటి నిల్చిన వేంకటేశ్వరా! 88

అర్థాలు -

పచ్చలు=మరకతమణులు; సందిదండలు -సందిటగట్టుకొనెడు భూషణములు, (కేయూరములు)బాహుపురులు =సందికడియములు, మణి నూపురంబులు = ముత్యాల అందెలు; మచ్చరికము = పోటి. పసిడి మట్టెలు = పెళ్లయిన ఆడవారు కాలివేలికి ఉంచుకునే బంగారపు తొడుగులు పిల్లు; మ్రోయగా= పెద్దగా మోగుచుండగా; ఓలి= వరుస; ముచ్చట = కోరిక

తాత్పర్యము ; వేంకటేశ్వరా! మా అమ్మ అలమేలుమంగమ్మ మరకతమణులు, కేయూరములు సందికడియములు ముత్యాల అందెలు ధరించింది. ఆ అందెలకు పోటిగా, ఆమె కాలికున్న మట్టెలు పెద్దగా చప్పుడు చేస్తున్నాయి. చెలికత్తెలు వరుసగా కొలుచుచుండగా అన్నిరకాల ఆభరణాలతో ఒకసారి ఆమె నీ ముందు నిలబడి , నీ ముచ్చట తీర్చింది.

ఏచిన పాతకంబులకు నిన్నిటికి న్నిరవైనవాడ నే

గాచినకష్టవృత్తి కరిగాపనె యోయలమేలుమంగ నీ

చూచుకృపానిరీక్షణమె చూచెద నంచును నీప్రియాంగనన్

బూచిన వాక్ప్రసూనముల బూజలు సేసెద వేంకటేశ్వరా !89

అర్థాలు –

ఏచిన = 1.అధికమగు.పాతకము= మహాపాపము. పంచమహాపాత కములు: 1, బంగారము దొంగిలించటం , 2.సురాపానము, 3.బ్రహ్మహత్య, 4.గురువుగారి భార్యతో శయనించుట , 5.ఇవి చేసేవారితో స్నేహము.) ఇరవైన=స్థానమయిన;అరిగాపు= కప్పము నొసంగువాడు

తాత్పర్యము ; వేంకటేశ్వరా! అనేక జన్మలలో చేసుకొన్న పాపాలన్నింటికి నేను స్థానమయ్యాను.ఆ పాపాలు నేడు విజృంభిస్తున్నాయి. ఈనాడు నేను అనుభవిస్తున్న కష్టాలన్ని నాడు చేసుకొన్న పాపాలకు కప్పాలు (=పన్నులు)కడుతున్నాయి.ఈ బాధలన్నీ తొలగిపోవటానికి నీ ప్రియసతి అలమేలుమంగను నా మాటలనే వికసించిన పూలతో – నీ దయతో కూడిన చూపు కావాలని – దానికోసం ఎదురు చూస్తున్నానని - గొంతెత్తి ప్రార్థిస్తాను.

యోగ్యత లేని కష్టుడ నయోగ్యుడ నన్నిట జూడ గర్భని

ర్భాగ్యుడ నీకృపామతికి బ్రాప్తుడ నోయలమేలుమంగ నా

భాగ్యము నీగ్రృపాకరుణ బ్రాప్యము కావుమటంచు సారెనీ

భాగ్యవతీ శిరోమణిని బ్రస్తుతిసేసెద వేంకటేశ్వరా ! 90

అర్థాలు;

యోగ్యత =అర్హత; కష్టుడ =దుష్టుడు;అయోగ్యుడు =యోగ్యుడు కానివాఁడు; గర్భనిర్భాగ్యుడు = గర్భదరిద్రుడు;కృపామతి =దయకలిగిన బుద్ధి కలిగినవాడు;ప్రాప్తుడు= దినవాడు;ప్రాప్యము=

పొందఁదగినది.కావుమటంచు =రక్షించుమని; సారె=మాటిమాటికి; భాగ్యవతీ శిరోమణిని = అదృష్టవంతురాళ్లలో తలమానికమువంటిది :ప్రస్తుతి=స్తోత్రము

తాత్పర్యము

- వేంకటేశ్వరా! నేను అర్హత లేనివాడిని. దుష్టుడిని. తల్లి గర్భములో ఉన్ననాటినుంచియే దరిద్రుడిని. దయకలిగిన నీచేత రక్షింపదగినవాడిని. నా అదృష్టము నీదయతో ముడిపడియుంది . నన్ను రక్షించు అని మాటి మాటికి అదృష్టవంతురాళ్లలో తలమానికమువంటిదయిన మా అమ్మ అలమేలుమంగమ్మను నీపేరుతో స్తోత్రము చేస్తుంటాను.

విశేషాలు;

అదృష్టము లేనివాడినిని అనిచెబుతూ అదృష్టవంతురాళ్లలో తలమానికమువంటిదిగా అలమేలుమంగమ్మను చెప్పుటలో చక్కటి ఔచిత్యము ఉంది.

తుఱు మఱవీడె బయ్యెదయు దోడనె జాతి మెఱుంగు టెప్పలన్

పరవశభావ మేర్పడియె బాయక నీ వలమేలుమంగ నీ,

వరుని దలంచితో యనుచు వాసనమేనుల దేవ కామినుల్

సరగున నీలతాంగి కుపచారము సేతురు వేంకటేశ్వరా! 91

అర్థాలు –

తురుము = కొప్పు : అరవీడు= సగము విడిపోయింది; పాయక - స్థిరముగా , వాసనమేనుల - సువాసనలు వెద జల్లు శరీరాలతో : దేవ కామినుల్ - దేవతా స్త్రీలు, సరగున - వెంటనే

తాత్పర్యము –

వేంకటేశ్వరా! నీ భార్య అలమేలు మంగమ్మ దగ్గరికి వెళ్లి దేవతాస్త్రీలు ఇలా అంటారు. "ఎందుకమ్మా! నీ కొప్పు సగం విడిపోయింది. దానికి తోడు పైట జారింది!? ప్రకాశించే రెప్పలపై పారవశ్య భావము ఏర్పడింది. ఏమిటి కథ? నీభర్త వేంకటేశ్వరుని తలచుకొన్నావా ఏమిటి? "అంటూ వాళ్లు అలమేలు మంగమ్మకు సేవలు చేస్తుంటారు.

రాజసలీల నన్నును గరంబునఁ బట్టకు చూప వేల నీ

తేజము నాకటంచు సుదతీమణి శ్రీయలమేలుమంగ ని

న్నీ జగదేకనాయకుని నింపొలయించుచు సారెసారెకున్

జాజులకొప్పువీడ సరసంబున వీచును వేంకటేశ్వరా!92

అర్థాలు -

రాజసలీల = రజోగుణము వల్ల కలిగిన గర్వముతో కరంబున బట్టకు = చేతితో పట్టకు సుదతీమణి = మంచి పలువరుసగల యాడుంది;

తాత్పర్యము –

వేంకటేశ్వరా! "ఏమిటి స్వామీ!చేయి పట్టుకొంటావేమిటి? అమ్మా! అసలు భయము లేకుండా పోయింది. నీ పరాక్రమము నా దగ్గర కాదయ్యో! " - ఇలా ఉత్తుత్తిగా కోప్పడుతూ అలమేలుమంగమ్మ జగదేక వీరుడవయిన

నిన్ను సంతోష పెడుతూ, మాటిమాటికి జాజులు కొప్పులోనుంచి జారుతుండగా నీమీదికి విలాసంగా ఆ పువ్వులను విసురుతోంది.

చక్కదనంబు రాశి నునుసానల బట్టినపువ్వుటమ్ములోఁ

జక్కెర నించి చేసిన రసస్థితి శ్రీయలమేలుమంగ నీ

మక్కువఁ జిక్కి మాతలభ్రమం దగులై కలవంత నిట్ల నీ

వక్కుఁనఁ జేర్పఁగా నలరె నన్నువ కౌఁగిట వేంకటేశ్వరా!93

అర్థాలు

నునుసానల = మణుల ఎచ్చుతగ్గులు మొ.వి పోవుటకై రాచెడినునుపైన రాలలో పువ్వుటమ్ములో= పువ్వులనెడి బాణములో; నించు= జనింప చేసిన; రసస్థితి - రస పొలిమేరలో ఉన్న: తగులై = ఆసక్తితో : కలవంత = బండిచక్రమువలె గిర్రున తిరుగు విచారము : అన్నువ = మనోహరమైన

తాత్పర్యము –

వేంకటేశ్వరా!మా అమ్మ అలమేలుమంగమ్మ చక్కదనముల రాశి. నునుపైన సానలలో పూల బాణాన్ని సానబెట్టి , దానిలో తియ్యని చక్కెర వేస్తే ఉండే మాధుర్యము కలిగిన శృంగార రసమునకు సంబంధించిన పొలిమేర లాంటిది. అటువంటి మా అలమేలుమంగమ్మకు. ఏమి మంత్రము వేసావో కాని - నీ ప్రేమలో చిక్కి పోయింది.నీ మాటల భ్రమలో ఆసక్తితో నీ ప్రేమలో పడిపోయింది. ఎందుకో మహాను భావా ! ఆమెని

దూరంగా పెట్టావు. బండి చక్రంలా గిరగిరా తిరిగే నీ విరహములో ఉన్న అమెను కరుణించి దగ్గరికి తీసుకొన్నావు. మనోహరమైన నీ కౌగిటిలో ఆమె సంతోషంగా ఉంది.

మానవతీ శిరోమణికి మంజులవాణికి మోవితేనియల్

కానికలిచ్చినాడ వట కౌగిట నాయలమేలుమంగకున్

మీనచకోరనేత్రి నిను మెచ్చి మదంబున గాగిలించి నీ

పానుపుమీది చేతలివి పచ్చి తలంపులు వేంకటేశ్వరా! 94

అర్థాలు –

మానవతి =అభిమానము (ఆత్మ గౌరవము) గల స్త్రీ; మంజులవాణి - మనోహరముగా మాట్లాడునది.కానిక = కానుక ; పచ్చి తలంపులు - మరుగు లేని ఆలోచనలు

తాత్పర్యము -

వేంకటేశ్వరా!మా అమ్మ అలమేలుమంగమ్మ ఆత్మగౌరవము గల స్త్రీలలో అగ్రగణ్యురాలు. చక్కగా మాట్లాడుతుంది. అటువంటి ఆవిడకి తమరు కౌగిటిలో మీ పెదవుల తేనెలను కానుకలిచ్చారట. (ఏంటయ్యా ఇది!? మా అమ్మ పెదవులనుంచి వచ్చిన మాటలే తియ్యగా ఉంటాయని నేనంటుంటే తమరు ఆ పెదవులకు తీపిని ఇవ్వవలసిన అవసరం ఏముంది? అమ్మా! ) చేపలవంటి చకోరాలవంటి కన్నులు కలిగిన మా అమ్మ నీపెదవి దయకు మెచ్చుకొని నిన్ను మదముతో కౌగిలించుకొంది. ఇవి మీ పానుపుపై జరిగిన చేష్టలు. ఏ మాత్రము లేని మఱుగు లేని నా ఆలోచనలు. (మీ గురించి ఏరకమైన ఆలోచన అయినా నాకు మఱుగు ఎందుకయ్యా! మీ మధ్య జరిగినవి ఉన్నదున్నట్లు చెప్పేస్తాను.నా భావాలు విని నువ్వు పడుచువాడివి అవుతుంటావు కదా!)

ధళధళ మించు కన్నుగవతమ్ముల మిమ్ముల జూపు చిమ్మినన్

గళవళమందకుండుదురె గ్రక్కున శ్రీయలమేలుమంగకు

సళువుల నవ్వు గొంత నునుసోనలగర్వము గొంతనవ్వుగా

కెలవుల గొంతకొంత పులకింతలు వింతలు వేంకటేశ్వరా ! 95

అర్థాలు

ధళధళ =మిక్కిలి ప్రకాశము, తళతళలు. కన్నుగవ= కన్నుల జంట ; తమ్ములము =తాంబూలము. కళవళము = కలత.; గ్రక్కున = శీఘ్రముగా సళువుల నవ్వు = భారమైన నవ్వు; నునుసోనల= నునుపైన కాంతుల కెలవు=అనురాగము. సంభోగేచ్ఛ.

తాత్పర్యము

వేంకటేశ్వరా! మా అమ్మ అలమేలుమంగమ్మ తన తళతళలాడే కన్నుల జంటతో తాంబూలాలు పెడుతూ నీ వైపు ఒక చూపు చిమ్మింది. ఆవిడ అలా చూపుల తాంబూలాలు పెడుతుంటే నువ్వు కలత పడకుండా ఎలా ఉంటావు? నువ్వు అలా కలత పడుతుంటే మా అమ్మ అలమేలుమంగమ్మ భారమైన ఒక నవ్వు నవ్వింది.ఆ నవ్వులలో నునుపైన కాంతులు.-తన అందానికి నువ్వు వశమయ్యారన్న గర్వము.-కొంత సంభోగేచ్ఛ- కొంత పులకింతల వింత- ఎన్నని చెప్పమంటావు. మహా ప్రభూ!

దర్పక రాజ్యసంపదలు తన్మయకోటులు రాగిలోకసం

తర్పణముల్ లతాధరసుధాపరిధానము లాననవ్రతుల్

కర్పురగంధసౌఖ్యములు గ్రక్కున శ్రీయలమేలుమంగకున్

మార్పడు దేహసంగతుల మర్మపుజేతలు వేంకటేశ్వరా ! 96

అర్థాలు

దర్పకుడు= మన్మథుడు.(=గర్వింపచేయువాడు);తన్మయం=మైమరచినస్థితి.ఆ స్వరూపమైనది.

సంతర్పణము=తృప్తిపరుచుట.(ఏడురకాలైన సంతర్పణాలు. ద్రాక్షపండ్లు, 2. పుల్లదానిమ్మ పండ్ల రసము, 3. ఖర్జూరపండ్లు, 4. పంచదార, 5. వరిపేలాల చూర్ణము, 6. తేనె, 7. నెయ్యి.)

పరిధానము = దోవతి,కట్టుబట్ట;ఆననము= 1. మొగము.2. నోరు. (ఆహారపానీయాదులు ఇచ్చుచున్న దీనిచే బ్రతుకుదురు కనుక నోటికి ఆననము అని పేరు వచ్చింది)

మార్పడు=మాఱుపడు ;దేహసంగతులు =1.శరీరము యొక్క చేరికలు.2. 2. శరీరము యొక్కజ్ఞానములు. 3. శరీరము యొక్క సమాచారములు.మర్మపుజేతలు = దొంగ చేష్టలు

తాత్పర్యము

వేంకటేశ్వరా! మా అమ్మ అలమేలుమంగమ్మతో తమరి శరీరము యొక్క చేరికల సందర్భముగా మా అమ్మ శరీరములో మారే శృంగారపు మోసపు చేష్టలు ఎన్నెన్ని చెప్పమంటావు?! ఆ దొంగ చేష్టలు 1.మన్మథ రాజ్యానికి సంపదలవంటివి.2.అనేక రకాల తన్మయాలకు నిలయాలు. 3.అనురాగము కలిగిన వారికి అనేక రకాల సంతర్పణములు. 4.తీగెలవంటి సన్ననైన పెదవులపై కప్పు బట్టలు. 5.మొగములు వ్రతములుగా కలిగినవి.6.కర్పూరము, గంధమును తమ సుఖ సాధనములుగా కలిగినవి.

**విశేషాలు**

**అన్నమయ్య చుల్లరిచేతలు( "చొల్లెపుఁజుట్లవో చొక్కనాథా నీ, చుల్లరిచేఁతలు గంటిఁ జొక్కనాథా." [తాళ్ల-21-436])పచ్చి చేతలు (ఇచ్చకపు నీవు సేసే యెన్నికలకే కదా, పచ్చిచేఁతలెల్లాఁజేసి భ్రమసితివి." [తాళ్ల-7-513] అని కీర్తనల్లో ప్రయోగించినట్లు గానే ఈ పద్యములో మర్మపు జేతలు అన్నాడు.**

**అంబరమెల్ల జంద్రమయ మైనటులామదనాంకముల్ మెయిన్**
**బంబిన నేడ వంచు సిరి పల్కిన నయ్యల మేలుమంగ పా**
**దంబుల యాన వెట్టితివి తమ్మియిగుళ్ళని నీకు బొంకులే**
**చెంబళమాయె నెవ్వరికి జెల్లవు రంతులు వేంకటేశ్వరా ! 97**

**అర్థాలు**

**అంబరమెల్ల = వస్త్రమంతా;**
**మదనాంకముల్ = మన్మథుని గుఱుతులు;**
**మెయిన్ =దేహములో;**
**పంబినన్ =అతిశయించినవి;**
**తమ్మియిగుళ్ళని = పద్మములయొక్క చిగురులని;**
**చెంబళమాయె = ఎక్కువయ్యాయి. (ప్రకరణార్థము);**
**రంతులు = క్రీడలు;**

**తాత్పర్యము**

**"వేంకటేశ్వరా! నీ వస్త్రమంతా చంద్రమయమైనట్లు – చంద్ర రేఖల్లాంటి ఈ మన్మథుని గుర్తులు ఏమిటి? నీ శరీరమంతా అవి బాగా అతిశయిస్తున్నాయి!? ఏమిటి కథ?" అని మా అమ్మ అలమేలుమంగమ్మ నిన్ను ఒక రోజు ప్రశ్నించింది. "అబ్బెబ్బే! అవి పద్మములయొక్క చిగుర్లు. నువ్వనుకొంటున్న గుర్తులు కా"వని ఒట్టు**

పెట్టావు.

వేంకటేశ్వరా! నీకు బొంకులు బాగా ఎక్కువయ్యాయి.క్రీడలు ఎవరికీ ఎక్కువ కాలము చెల్లవు. గుర్తు పెట్టుకో!

చెఱగులు చూపి క్రొవ్విరులు చిందెడు తేనెలు నాల్గువంకలన్
వఱదలు వాఱె ఘర్మములు వాహినులై యలమేలుమంగతో
గఱగుచు నీవు కౌగిట సుఖస్థితి గూడుచు బంధుసంగతిన్
దెఱదిగనేసి వేడుకలు తెప్పల దేలగ వేంకటేశ్వరా ! 98

అర్థాలు

చెఱగులు =అంచులు

క్రొవ్విరి = కొత్తపువ్వు.

వంక =దిక్కు

వఱదలువాఱె= ఎక్కువగా ప్రవహించినవి.

ఘర్మము =చెమట

వాహిని = నది

తెఱ =మరుగుచీర

దిగనేసి = విడిచి

తెప్పల దేలగ = ఊగాడగా, ఓలలాడగా !

తాత్పర్యము

‘‘వేంకటేశ్వరా!మా అమ్మ అలమేలుమంగమ్మతో మీరు సుఖాలలో కరుగుతున్నసమయములో ,కొత్త పువ్వులలోని తేనెలు నాలుగు వంకలకు ఎక్కువగా ప్రవహించాయి. ఆ ప్రవాహాలలో పూలరేకుల అంచులు కనబడి ‘ఈ ప్రవాహాలు మావే’ అని నిర్ధారిస్తున్నాయి. ఇద్దరి చెమటలు నదులుగా మారాయి. బంధువులందరికి కనబడకుండా తెరలు కట్టి మీ ఇద్దరూ ఉత్సాహాలలో ఓలలాడుతున్నారు.

వాలికనేత్రపద్మములు వంచిన యావదనంబు పద్మినీ
పాల జనింపనందుననె పద్మినియై యలమేలుమంగ గో
పాలక చక్రవర్తి నినుబాయని కౌగిట భోగలీలబాం
చాలునిజేసె పుష్పశరశాస్త్రవిదగ్ధుని వేంకటేశ్వరా ! 99

అర్థాలు

వాలిక= 1.దీర్ఘము.2. వాడియైనది.

పద్మినీ= ఉత్తమజాతి స్త్రీ.

అలమేలుమంగ =తిరుపతి సమీపమునగల తిరుచానూరు అను క్షేత్రమున వెలసియున్న మహాలక్ష్మి - శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవేరి పద్మావతి అమ్మవారు. అలరు + మేలు + మంగ.

పాయని= విడువని

పాంచాలుడు =ఏకాంతంలో కాంత కళాస్థానాలను కరగించి వశపరచుకొనేవాడు

పుష్పశరశాస్త్రవిదగ్ధుని = మన్మథ శాస్త్ర మునందు నేర్పరిని

తాత్పర్యము

"వేంకటేశ్వరా!మా అమ్మ అలమేలుమంగమ్మ నిన్ను చూసిన ఒక సందర్భములో తన దీర్ఘమైన పద్మాలవంటి కన్నులతో ఉన్న తన ముఖాన్ని సిగ్గుతో వంచింది.. ఎందుకంటే తాను పద్మిని జాతి స్త్రీ అయినప్పటికీ , తన మోము పద్మాలతో సహ పుట్టలేదని.ఆ దిగులు పోగొట్టి ఓదార్చటానికి గోపాలక చక్రవర్తియైన నువ్వు అలా తలదించుకొన్న అలమేలుమంగమ్మను విడువని కౌగిటిలోకి తీసుకొన్నావు.కామ శాస్త్రమునందు నేర్పరివైన నిన్ను భోగాలలో తేలించి పాంచాలునిగా మా అమ్మ తయారు చేసింది.

అమ్మకు దాళ్ళపాకఘనుడన్నడు పద్యశతంబు జెప్పెగో
కొమ్మని వాక్ప్రసూనముల గూరిమితో నలమేలుమంగకున్
నెమ్మది నీవు చేకొని యనేక యుగంబులు బ్రహ్మకల్పముల్
సమ్మది మంది వర్ధిలను జవ్వన లీలల వేంకటేశ్వరా ! 100

అర్థాలు

అమ్మకు = అలమేలుమంగమ్మకు;అన్నడు = అన్నమయ్య; వాక్ప్రసూనముల= మాటలనే పూలతో

తాత్పర్యము

వేంకటేశ్వరా! మాటలనే పూలతో, ప్రేమతో- అలమేలుమంగమ్మ పేరు మీద, తాళ్లపాక అన్నమాచార్యులు అనే ఈ గొప్పవాడు వంద పద్యాలు చెప్పాడు. వాటిని నువ్వు నింపాదిగా గ్రహించి అనేక యుగాలు, బ్రహ్మ కల్పాలు సంతోషంతో యౌవన లీలలతో వర్ధిల్లు.

**విశేషాలు**

**యుగములు, బ్రహ్మ కల్పముల వివరణ**

**కృత యుగము = 4,800 దివ్య సంవత్సరములు = 17,28,000 మానవ సంవత్సరములు**

***త్రేతా యుగము = 3,600 దివ్య సంవత్సరములు = 12,96,000 మానవ సంవత్సరములు**

**ద్వాపర యుగము = 2,400 దివ్య సంవత్సరములు = 8,64,000 మానవ సంవత్సరములు**

**కలియుగము = 1,200 దివ్య సంవత్సరములు = 4,32,000 మానవ సంవత్సరములు**

***మొత్తము 12,000 దివ్య సంవత్సరములు = 43,20,000 మానవ సంవత్సరములు – ఒక దివ్య యుగము (చతుర్యుగము, మహాయుగము)**

**ఇలాంటి వేయి దివ్య యుగములు బ్రహ్మదేవునకు ఒక పగలు. బ్రహ్మ పగలును కల్పము (సర్గము) అంటారు. మరొక వేయి దివ్య యుగములు బ్రహ్మదేవునకు ఒక రాత్రి.ఈ రాత్రిని ప్రళయము అంటారు. అటువంటి 360 దివారాత్రములు బ్రహ్మకు ఒక సంవత్సరము. అటువంటి 100 సంవత్సరములు బ్రహ్మ ఆయుఃకాలము.**

**(స్వామి దయతో అన్నమయ్య వేంకటేశ్వర శతక లఘువివరణ పూర్తయింది. అభిమానించిన అందరికి ధన్యవాదములు.)**

*****